స్థాపకుడు:నెల్లూరు వెంకట్రామానాయుడు

# జమీన్‌రైతు

శివప్రదాత:నెల్లూరు శ్రీరామమూర్తి

## "తప్పు చేస్తే ఉరితీయండి"



సొందాయమ్మ పిల్లల వ్యాపారానికి కేంద్ర మన దగిన తడ స్కూలు భవనం

అనాథాశ్రమం ముసుగులో అమాయక పసి బిడ్డలను విదేశాలకు అమ్మి లక్షలార్జించిన సంచలన " సంఘ సేవిక" సొందాయమ్మ పై ప్రత్యేక వార్తా కథనం- 2 పేజీలో!

# పివితో కయ్యానికి సై అంటున్న కోట్ల!

ఇటు కేంద్రంలో, ఇటు రాష్ట్రంలో త్వరలో మంత్రి వర్గ విస్తరణలు జరుగుతా యనుకుంటున్న నేపథ్యంలో రాష్ట్ర రాజకీయాలు రంజుగా తయారయ్యాయి. ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావుకు

> ప్రధాని పదవి పై మోజుతో అసమ్మతికి అండగా నిలుస్తున్న ముఖ్యమంత్రి

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డికి మధ్య సంబంధాలు బెడిసి కొట్టడంతో కేంద్ర,

రాష్ట్ర మంత్రి వర్గాల పునర్వ్యవస్థీకరణలో సరికొత్త పాత్రలు రాజకీయ తెరపై కనిపించే

పడగ లెత్తిని పారిశ్రామిక వేత్త; ఉయ్యూరులోని కెసిపి చక్కెర కర్మాగారం స్థాపకుడైన శ్రీ వెలగపూడి

రకాల రాజకీయ ప్రాధాన్యతలు కల్గిన ప్రభు, అసమ్మతి విందు ఏర్పాటు చేయడంలోని అంతరార్థం పట్ల

వారిని వదిలేశారని ప్రచారం జరుగుతూంది. ఏది ఏమైనా ప్రభు అసమ్మతి విందు కోట్ల, పివిల మధ్య పూడ్చలేని అగాధం సృష్టించింది.

ప్రధాని పదవి పై ముఖ్యమంత్రికి రోజు రోజుకూ మోజు

## ఢిల్లీ నాటకంలో ఆంధ్ర నాయకత్రయం!

అవకాశముంది. శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి ఇన్నాళ్లు ప్రధాన మంత్రికి అండగా వున్నారు. కానీ ఇటీవలి ఢిల్లీ రాజకీయ పరిణామాల్లో కోట్ల వారు ప్రధాన మంత్రికి వ్యతిరేకంగా వ్యవహరించారన్న విమర్శ వచ్చింది. ప్రధాన మంత్రి పి.వి. నరసింహా రావును గద్దె దించాలని మాజీ మంత్రి శ్రీ ప్రభు అసమ్మతి విందులు నిర్వహించడం వెనుక కోట్ల వారి ఆశీస్సులున్నట్లు ప్రధాన మంత్రి పసిగట్టడంతో త్వరలో రాజకీయాల్లో అనూహ్యమైన మార్పులు చోటు చేసుకో వచ్చుని భావిస్తున్నారు.

శ్రీ ప్రభు ఆంధ్రుడు; కోట్లకు

> కోట్లకు పోటీగా జనార్దన రెడ్డిని దువ్వడానికి పివి సంకల్పం

రామకృష్ణ మనుమడు; స్వర్గీయ రాజీవ్ గాంధీ కుటుంబానికి అప్తుడు; కోట్లవారికి వ్యక్తిగత మిత్రుడు. ఇన్ని

సహజంగానే ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

ప్రభు విందుకు వెళ్ల వద్దని ముఖ్యమంత్రి ఢిల్లీకి ఫోన్ చేసి కొందరు ఎమ్పీలకు సూచనలిచ్చిన మాట నిజం. అయితే అది పైపై నటనే నని, తెర వెనుక నుంచి ఆయనే అసమ్మతి కార్యకలాపాలకు పురమాయించాడని పివి అనుమానిస్తున్నారట. స్పష్టంగా పివి అనుకూల వైఖరి వున్న ఎమ్పీలు – వారెటూ ఆ విందుకు వెళ్లరని తెలుసు కాబట్టి – కొందరికి మాత్రమే ముఖ్యమంత్రి ఫోన్లు చేశాడని, అసమ్మతి పట్ల సానుకూలంగా వుండే

> అక్కడ అసమ్మతి ఇక్కడ సమ్మతి– వై.ఎస్‌సరికొత్త రాజకీయ వ్యూహం!

పెరుగుతోంది. కేంద్రంలో పి.వి. గద్దె దిగితే దక్షిణాదికి చెందిన ఓ

తరువ 10వ పేజీలో

## సంఘసేవ ముసుగులో సొందాయమ్మ అఘాయిత్యాలు

# అనాథలైతే మాత్రం అమ్మకానికి పెట్టాలా?

నెల్లూరుజిల్లా దినపత్రిక తెరిస్తే కొట్టొచ్చినట్లు కన్పించే ఒకే ఒక పేరు – సొందాయమ్మ! ఆ పేరు ప్రస్తావన లేకుండా ఏ దినపత్రికా వెలువడడం లేదు. ఆమె మీద వస్తున్న ఆరోపణలేమో తీవ్రాతి తీవ్రమైనవి; వాటి పై దర్యాప్తు లేదా చర్య మాత్రం అత్యంత ఉదాసీనంగా వుంది! పైగా వివాదానికి రాజకీయ

తెలియడం లేదు.

ఇంత వివాదానికి కారణ భూతురాలైన సొందాయమ్మ ఒక "అనాథ" అంటే ఆశ్చర్యం కలుగుతుంది. చిత్తూరు జిల్లాకు చెందిన ఆమె, చిన్న తనంలోనే తండ్రిని పోగొట్టుకున్నది. పోషించలేని దుర్భర దారిద్ర్యంలో తల్లి కూడా తనను వదిలేస్తే, ఒక అనాథాశ్రమంలో

చిన్న నాటి నుంచి కష్టాలు, కన్నీళ్లు, నిరాదరణలను అనుభవించిన సొందాయమ్మలో అపారమైన తెలివితేటలతో పాటు, సహజంగానే అమితమైన తెగింపు వుండడంలో

**పసికందులను అమ్ముతుందన్నది అందరి ఆరోపణ; ఆ తప్పు చేసి వుంటే వురి తీయమంటున్నది సొందాయమ్మ; నిజానిజాలు వెలికి రావాలంటే లోతుగా దర్యాప్తు జరగాలి!**

వ్యాపారానికి శ్రీకారం చుట్టింది. తడలో స్కూలు ప్రారంభించి, కుప్పాలలోని పిల్లలను చేర్చుకొని, వారి తల్లిదండ్రుల గురించి ఆరా తీసి, పరిచయం పెంపొందించు కోవడం ఆమె వ్యాపార విధానం. ఈ స్కూలు విదేశీ నిధులు వచ్చేవట. అప్పుడప్పుడు స్కూలు పిల్లలకు చిరిగిన గుడ్డలు వేసి,

పిల్లలకు సుఖప్రదమైన జీవితం కల్పిస్తామని ఆశ పెట్టి, చట్టం ప్రకారం వారి నుంచి సమ్మతి పత్రాల వంటివన్నీ పకడ్బందీగా తీసుకొని, పిల్లలను హైదరాబాదులోని యాక్షన్ ఫర్ సోషల్ డెవలప్‌మెంట్ అనే సంస్థకు చేరవేసేదట. 1979 లో ప్రారంభమైన ఈ సంస్థకు 1989 లో కేంద్ర ప్రభుత్వ గుర్తింపు లభించింది.



తొలిసారిగా పసిపిల్లల విక్రయం పై కలెక్టర్‌కు ఫిర్యాదు చేసి తమ బిడ్డను వెనక్కు తెచ్చుకోగల్గిన నిర్మల దంపతులు.



అనాథలుగా పెరగాల్సిన వారిని అమెరికన్ సంపన్నులకు దత్తత ఇచ్చి ఎంతటి సుఖప్రదమైన జీవితాన్ని కల్పిస్తున్నదీ చెప్పడానికి రుజువుగా సొందాయమ్మ ఇచ్చిన ఫోటోలు – 8 నెలల పసికందు నుంచి ఆరేళ్ల అమెరికా పాపగా ఎదిగిన ఒక బాలిక 'సుజాత'

దుర్వాసన అంటుకున్నది. బిజెపి జాతీయ ప్రధాన కార్యదర్శంతటి వాడు సొందాయమ్మ గురించి సభల్లో మాట్లాడుతున్నాడు; సమాచార

పెరిగింది. అనాథాలలో తొలిసారిగా అన్ని తరగతులలోనూ ఫస్ట్‌క్లాస్ మార్కులతో పాసైన విద్యార్థినిగా ప్రశంసలందుకొని, కష్టపడి చదివి

**పిల్లలందరూ అక్రమ సంతానాలే; అందువల్లే వాస్తవాలు వెల్లడి కావడం లేదు; అమెరికాకు ఎగుమతిలో అన్నీ అనుమానాలే; అయినా దర్యాప్తు అంగుళం ముందుకు సాగడం లేదు!**

మంత్రి శ్రీ పసల పెంచలయ్య ప్రెస్ కాన్ఫరెన్స్‌లు పెడుతున్నారు; ఎస్పి ఇప్పటికెన్నో వివరణలిచ్చారు. ఇంత రగడ జరుగుతున్నా వాస్తవాలు మాత్రం వెలుగులోకి రావడం లేదు. అరాకొర నిజాలు, అర్థ సత్యాలు తప్ప

బి.ఎ., బి.ఇ.డి., డిగ్రీ సంపాదించింది. కొంత కాలం మద్రాసులో ప్రభుత్వోద్యోగినిగా పనిచేసింది. తడకు చెందిన జాన్ సుహాసం అనే ఎం.ఎ., ఎం.ఇడి చదివిన విద్యావంతుడ్ని పెళ్లాడి, తడలో కాపురం పెట్టింది.

ఆశ్చర్యం లేదు. అవి రెండే ఆమెనీనాడు లక్షాధికారిణిగా పెంచాయి; వివాద గ్రస్తురాలిని చేశాయి.

తడలో "ఓపన్ ఆర్మ్స్" అనే స్కూలుతో తన పసిపిల్లల



తన బిడ్డను తిరిగి ఇవ్వమని హఠం చేస్తున్న మస్తానమ్మ

వ్యాపారాన్ని ప్రారంభించిన సొందాయమ్మకు అనాథాశ్రమాలు, చట్టాలు, నిబంధనలు, వాటిలోని లొసుగులు బాగా తెలుసు. వాటిని అడ్డం పెట్టుకొని ధనార్జన చేయడమూ తెలుసు. 1987 లో ఆమె తన

ఫోటోలు తీసి, విదేశాలకు పంపేదట. మధ్యాహ్న భోజన పథకం వంటివి ప్రవేశ పెట్టి నిధులు సేకరించి, స్వాహా చేస్తుండేదనీ ఆరోపణ. 1988 లో వుమన్ అండ్ చైల్డ్ వెల్ఫేర్ సోషల్ సర్వీసు అనే సంస్థను స్థాపించింది. 89లో దానిని రిజిష్టరు చేశారు. దీనికి అనుబంధంగా సైమన్ ఓపన్ ఆర్మ్స్ ఆర్ఫనేజి అనే సంస్థ ప్రారంభించారు. అక్రమ సంతానాలను, ఆర్థిక స్థితిలేక పోషించలేని వారి పిల్లలను ఆదుకోవడం ఆర్ఫనేజి ఆశయంగా ప్రచారం చేశారు.

ఈ ఆర్ఫనేజిలో ఆమె పిల్లలను చేర్చుకున్నట్లు, తిండి పెట్టి చదువు సాము నేర్పించినట్లు దాఖలా లేవీ కన్పించడం లేదు. కాని పరిసర గ్రామాలలో తిరిగి అనాథ పిల్లలను సేకరించి, అమెరికాకు ఎగుమతి చేసినట్లు మాత్రం రుజువు లున్నాయి. వ్యభిచారిణులు, పెండ్లి కాకుండా తల్లులైన వారిని కనిపెట్టి వారి

ఈ ఐదారేళ్లలో సొందాయమ్మ 29 మంది పిల్లలను సేకరించిందట. అది ఆమె చెప్తున్న సంఖ్య; రికార్డులలో వారి పేర్లున్నాయి. ఇందులో 11 మందిని విదేశాలకు పంపించామని, ముగ్గురు చనిపోయారని, ఒకర్ని తిరిగి తల్లిదండ్రులకు అప్పగించామని, తక్కిన వారు దేశంలోనే వున్నారని ఆమె చెప్తున్నది. అయితే ఈ సంఖ్య తప్పని, తన విచారణలో 47 మంది పిల్లలు సొందాయమ్మ చెంతకు చేరినట్లు తెలుస్తున్నదని వాయుదుపేట ఎమ్మార్వో కలెక్టర్‌కు నివేదిక ఇచ్చారు. అనధికారిక లెక్కలు అంత కంటే ఎక్కువగా వినవస్తున్నాయి. అసలు సంఖ్య ఎంతో చెప్పే వారు లేరు. కలెక్టర్ ఆదేశం మేరకు గూడూరు సబ్ కలెక్టర్ శ్రీ సునీల్ శర్మ, సొందాయమ్మ ఇంటిపైన, స్కూలు పైన దాడి చేసి కొన్ని రికార్డులు స్వాధీనం చేసుకున్నారు. వాటితోనూ నిజాలు బయట పడలేదు.

కొరవ 6 పేజీలో

# జమీన్‌రైతు

## అర్జునాస్త్రాలు

అసమ్మతి పెను ఉప్పెనను నిలువరించడంలోనే కాంగ్రెస్ అధిష్టాన నాయకత్వం శక్తి, యుక్తులన్నీ హరించుకొని పోతున్నట్లున్నాయి. ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు పై అర్జున్ సింగ్ ప్రయోగిస్తున్న విమర్శనాస్త్రాలు లక్ష్యాన్ని ఛేధించ లేక పోతున్నప్పటికి పార్టీ ప్రతిష్టను, పటిష్టతను పునాదులతో సహా పెకలిస్తున్నాయి. మిన్ను విరిగి మీద పడ బోతున్నా, పడనీలే చూద్దాం అన్న నిర్లిప్త వైఖరితో వ్యవహరించడం పార్టీని నాయకత్వాన్ని నిర్వీర్య పరుస్తున్నది.

కీలకమైన నాలుగు ఉత్తరాది రాష్ట్రాలలో శాసన సభ ఎన్నికలు రెండు నెలలలోగా జరప వలసివున్న సమయంలో ఇటు అధినాయకత్వం, అటు అసమ్మతి వర్గం తమ బల ప్రదర్శనకు విన్యాసాలు చేయడం చూస్తుంటే కాంగ్రెస్ పార్టీకి శాశ్వతంగా సమాధి కట్టబోతున్నారా అన్న సందేహం కలుగుతూంది. రాజీవ్ గాంధీ జయంతి సందర్భంగా కురుక్షేత్రలో జరిగిన సభలో అర్జున్ సింగ్ ప్రసంగానికి ఆటంకాలు కల్పించి, అల్లరి చేయడంతో అసమ్మతి కార్యక్రమాల విజృంభణ మొదలైంది. హర్యానా ముఖ్యమంత్రి ఆఅల్లరికి బాధ్యత వహించి క్షమాపణ చెప్పడం పోయి, అర్జున్‌సింగ్‌ను పార్టీ నుంచి బహిష్కరించాలని ప్రకటన చేయడంతో ఇవి తారాస్థాయి నందుకున్నాయి. దీనికి ప్రతిగా అర్జున్‌సింగ్ వర్గీయులు ఎమ్పీల సంతకాల సేకరణ ప్రారంభించారు. శాసన సభ ఎన్నికలకు ఏమి చేసింది, ఏమి జాగ్రత్తలు తీసుకున్నది ప్రశ్నించడం ఈ సంతకాల సేకరణ ఉద్దేశ్యమని పైకి చెప్పినా – అంతరార్థం మాత్రం తమ బలం ప్రదర్శించ బూనడమే. ప్రధానిఆఖరి క్షణంలో నిద్ర మేలుకొని, హడావుడిగా జిల్లా ఎన్నికల పరిశీలకుల నియామకం చేసి ఆ ప్రయత్నాన్ని నిరోధించారు. కాని ఆ వెంటనే తమిళనాడు ఎమ్పీ శ్రీ ప్రభు ఒక విందు సమావేశం ఏర్పాటు చేసి, అర్జున్‌సింగ్‌కు 80 మంది ఎమ్పీల మద్దతు వుందని నిరూపించాడు. దీనికి ప్రతిగా మరొక తమిళనాడు ఎమ్పీ శ్రీ ఎరా అంబరసు ఇంకొక విందు సమావేశం జరిపి ప్రధాని అనుకూలుర మద్దతును కూడగట్టాడు.

ఈ పోటాపోటీలు చాలవన్నట్లు పార్లమెంట్ సమావేశాల చివరి రోజు జరిగిన సిఎల్పి సమావేశంలో తమకు మాట్లాడే అవకాశం కల్పించనందుకు కినుక వహించిన అర్జున్‌సింగాది నాయకుల ప్రక్క రోజే మరొక సమావేశం జరప వలసి వచ్చింది. ఈ సమావేశంలో రెండు పక్షాల మధ్య అమీతుమీ తేలిపోతుందని అందరూ వూహించారు; చీలిక వస్తుందని భయపడ్డారు;కాని అవేవీ జరగక పోవడంతో హాయిగా వూపిరి పీల్చుకున్నారు. అసమ్మతి వత్తిడికి తల ఒగ్గ వలసిన బలహీన స్థితికి అధిష్టాన వర్గం చేరి పోయిందనడానికి నిదర్శనమీ పరిణామాలు.

రాజీవ్ గాంధీ మరణానంతరం కాంగ్రెస్‌ను ఏక త్రాటి పై నడిపించ గల్గిన నాయకత్వం లేకుండా పోయింది. ప్రధాని శ్రీ పి.వి. ఎంత చాకచక్యం ప్రదర్శించినా, చాణక్యం నడిపినా అవి పైపై పూతమందులే తప్ప లోపల శరీరాన్ని కుళ్ల బెడ్తున్న వ్యాధికి చికిత్స కాదన్న సంగతి అందరెరిగిందే. ఇప్పుడు ప్రభుత్వం పడిపోయి ఎన్నికలకు దారితీస్తే విజయం సాధిస్తామన్న నమ్మకం లేక, ఎన్నికల ఖర్చు భరించే శక్తి లేక ఇటు కాంగ్రెస్ ఎమ్పీలు, అటు బిజెపి మినహా ప్రతిపక్షాలు చక్రాలు విరిగిన సర్కారు శకటాన్ని ముందుకు నెడుతున్నాయే తప్ప, ప్రభుత్వ మనుగడకు పివి ప్రతిభ ఒక్కటే కారణం కాదన్నది వాస్తవం. పదవి నుంచి తప్పుకోవలసిన పరిస్థితి కల్పిస్తే, లోక్‌సభను రద్దు చేసి ఎన్నికలు జరిపించమని సిఫార్సు చేస్తాడేమో నన్న భయంతోనే అర్జున్‌సింగ్ కూడా ప్రమాదం అంచు వరకు పార్టీని నడిపించి, వెనక్కు తగ్గుతున్నాడు ప్రతిసారీ!

అయోధ్య సంఘటనల ద్వారా మతోన్మాదాన్ని రెకెత్తించిన బిజెపి ఢిల్లీ పీఠం కోసం పొంచి వుంది. ఇప్పటికిప్పుడు ఎన్నికలు జరిగితే వారి ప్రభంజనం ముందు తతిమా పార్టీలన్నీ గాలికి కొట్టుక పోతాయన్న భీతి నెలకొని వుంది. బిజెపి వంటి మత ఛాందస పార్టీలు అధికారంలోకి వస్తే జరగబోయేది సర్వనాశనమే. దేశ సమగ్రత, సంక్షేమాలకు అది గొడ్డలి పెట్టు అవుతుంది. ఈ ప్రమాదం నుంచి దేశాన్ని రక్షించడానికి కాంగ్రెస్ నాయకత్వంలో ప్రతిపక్షాలన్నీ కలిసి ఉమ్మడి పోరు సల్ప వలసిన ఆవశ్యకత వుంది. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో కాంగ్రెస్ పార్టీ అంతః కల్లోలాలతో బలహీన పడడం దురదృష్టకరం. ప్రధాని నాన్చుడు వైఖరిని విడనాడి ప్రజలను ఆకర్షించ గల, ప్రజా సంక్షేమానికి ఆచరణలో ఉపకరించ గల పథకాలను తక్షణం అమలు చేయడం; పార్టీలోని అందరు నాయకులనూ కలుపుక పోయి, వారిని విశ్వాసంలోకి తీసుకొని ప్రవర్తించడం జరగాలి. రాష్ట్ర శాసనసభ ఎన్నికలకు పార్టీని, లౌకిక శక్తులనుసమాయత్తం చేయడంలో, బిజెపిని ప్రతిఘటించడానికి తగిన సాధన సంపత్తులు సమకూర్చు కోవడంలో ఏ మాత్రం ఆలస్యం లేకుండా చిత్తశుద్ధితో కూడిన కృషి జరగాలి. ఈ దిశలో వైఫల్యం చెందితే కాంగ్రెస్‌కు భవిష్యత్‌లో మంచి నీళ్లు పుట్టవు.

## జమీన్‌రైతు

3.9.1943

4 పేజీలు 0-1-6 అణా:

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

### నెల్లూరు ముచ్చట్లు

ముసలి పెండ్లి: కనపర్తిపాడు కాపురస్తుడు, పంటకాపు, భూస్థితి, షుమారు 65 సం.ముల వయస్సు గల యువకుడు, బుడంగుంట కోటారెడ్డి అనే 25 వేల రూపాయల ఆస్తి గల వ్యక్తికి, గూడూరు తాలూకా వల్లిపేడు కాపురస్తుడు, మెతక బుద్ధి సంసారి, యద్దల పిచ్చిరెడ్డి తన కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతి, షుమారు 25 సంవత్సరముల కన్యనిచ్చి గతే నెల 25 తేదిన కాబోలు, వివాహ మహోత్సవము యధావిధిగ జరిపెను. వరునిది ఏదో యింత తాగగలిగిన సంసారం అనే దానికంటే యీ పెండ్లికి కారణం కనిపించదు. యీ లాటి పచ్చి దుర్మార్గం జరుగుతుంటే దిక్కుమాలిన సంఘం కళ్లు దెరుచుకొని పులుకు పులుకున చూస్తుండ వలసినదేనా?

* * *

ఈ మధ్య కోట పోలూరు, కాటూరు, మిత్రుల తాలూకా రెండవ వివాహం జరిగింది. రెండేళ్ల నాడు ప్రథమ వివాహం. భార్య మంచి వర్చస్విని, గుణవంతురాలు, ఒక కుమారుడు, మర్లీ గర్భం గూడా. ఇరువురు గువ్వజంట మాదిరి అన్యోన్యాను రాగ బద్ధులు. ఏ కారణం లేకుండా ప్రథమ భార్య చెల్లెల్ని పెండ్లాడాలని పట్టు. ప్రథమ భార్యను లొంగదీసుకున్నాడు. ఆ ఉత్తమురాలే భర్త మాటను జవదాటలేక తండ్రిని నిర్బంధ పరచి తన చెల్లెలి నిచ్చి వివాహం జేసింది.

ఈలాంటి వివాహాల నెంత మాత్రం ప్రోత్సహించ రానిది వీలు లేదు. కాని "గతం గతః". భగవంతుడు యీ భర్తా భార్యలకు అన్యోన్య బద్ధానురాగాలు, కుటుంబానికి మమేకత ప్రసాదించుగాక.

-విమర్శకుడు

### ఆహార సంక్షోభం

బెంగాల్‌లో, ముఖ్యంగా కలకత్తా నగరంలో ఆహార సంక్షోభం వర్ణనాతీత మైనంతటి విషాద రూపం దాల్చింది. అన్నం లేక డొక్కలు ఎండి, యెందరో రోడ్ల మీద పడిపోతున్నారు. యింత వరకు అట్టి వారు 1016 గురను యేరి, వివిధ ఆసుపత్రులలో చేర్చారు. వారిలో యింత వరకు 245 గురు మరణించారు. మరెందరో నగర వీధులలో నిండు ప్రాణాలను నిలువునా వదిలేస్తున్నారు. ఈ విషాద దృశ్యాలను "స్టేట్స్‌మెన్" పత్రిక ప్రకటించు తూన్నది. అవి చూస్తుంటే, హృదయం చలించక పోవునా?

ఒక్క చాందిపూర్‌లో ఆగస్టులోనే160 మంది అంత క్రితం మూడు మాసాలలో 373 గురు తిండిలేక మరణించారు.

పరిస్థితులు నానాటికీ విషమించి పోతున్నాయి. బెంగాల్ బాధితులకు అన్ని విధముల సహాయం చేకూర్చి వారి ప్రాణాలు నిలబెట్ట వలసిన ప్రాథమిక బాధ్యత అటు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మీద; ఇటు ఉదారాశయులగు ప్రజల మీద గూడా వున్నది. దీన్ని గుర్తించి, వివిధ ప్రాంతాలలో పలువురు పెద్దలు బెంగాల్ బాధితుల సహాయ నిధిని వసూలు చేస్తున్నారు. మన రాష్ట్రంలో గూడ "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" పత్రిక వారు బెంగాల్ సహాయనిధిని వసూలు చేస్తున్నారు. ఆంధ్రా వని యందంతటా జాతీయ విద్యార్థి సంఘాలు హుండీలు, విరాళాల ద్వారా నిధిని వసూలు చేస్తున్నాయి.

రాయలసీమలో కలకత్తా దృశ్యాలు దృగ్గోచర మవుతున్నాయన వచ్చు. మదనపల్లి తాలూకాలో అన్నం దొరక్క, బీద ప్రజలు కలబంద గడ్డలు, దేవ దారు ఆకులు తింటున్నారు. దీని వల్ల అతిసార మునకు గురియౌతున్నారు.

తుమ్మనగుట్ట గ్రామంలో ఆకలిబాధకు తాళలేక, అన్నందొరికే నదుపాయమే లేక, తన ఇరువురు బిడ్డలనూ బావిలో పడేసి, తనూ ఆ బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది.

### రంగా బొమ్మకు చెప్పుదెబ్బ!

ఆ మధ్య కమ్యూనిస్టులు కృష్ణ జిల్లాలో ఒక గొల్ల భాగోత మాడారు ఆచార్య రంగాగారి వేషం ఒక వీర కమ్యూనిస్టు, భారత మాత వేషం మరో వీర కమ్యూనిస్టు ధరించి "రంగా, నీవు పంచమాంగ దళమువు నా కడుపున చెడబుట్టావు. నీవు జపాన్‌యే జంటువు" అనిపించి చీపురుకట్టతో రంగా వేషధారిని కొట్టించడం మొదలు పెట్టేసరికి రైతులంతా ఆ కమ్యూనిస్టుల మీదకు కర్రల దూసి, "మా రంగాగారిని అవమానిస్తారా, దేశద్రోహులారా?" అని దాడి వెడలి ఊరు నుంచి బయటకు తరుమగొట్టారు. యెన్ని చీవాట్లు పెట్టినా జోషీ ముఠా వీర వరులకు బుద్ధి వస్తుందా?

# జీవితమంటే తీపి లేదు– ప్రాణమంటే విలువా లేదు!

దివంగత ఎమ్మెల్యే పి. శివారెడ్డి గారి రాజకీయ జీవిత విశ్లేషణా వ్యాసం ఎంతో సాహసంతో కూడుకున్నది. రాయలసీమలో అటువంటి రాజకీయ నాయకులు ఎందరో వున్నారు. వారిలో శివారెడ్డి గారు ఒకరు, అంతే!

రాయలసీమ ప్రాంతంలో ప్రజలకు జీవితమంటే తీపిలేదు; ప్రాణానికి విలువ లేదు. అందువల్లే అక్కడ హింస, రక్తపాతం సర్వ సామాన్యం. నడి బజారులో, జనసమ్మర్థమైన చోట హత్య జరిగినా, ఆ అలజడి కేవలం 5 నిముషాలే. ఆ తర్వాత ప్రజా జీవనం అతి సహజంగా కదలి పోతుంది; ఆ ఘోరాన్ని అంత త్వరగా మర్చిపోతారు.

ఈ నిర్లిప్త మనః ప్రవృత్తికి కారణం వుంది. రాయలసీమలో ఒక సామాన్య కుటుంబం రేయింబవళ్లు పొలంలో కష్టపడి పని చేసినా సంవత్సరానికి వచ్చే ఫల సాయం చేతికి, నోటికి సరిపోదు. ఆ నిరాశ, నిస్పృహలలో నుంచి పుట్టుకొచ్చే ఆవేదన, ఆక్రోశం వారిలో పరుషత్వాన్ని, పౌరుషాన్ని పెంచుతున్నాయి. జీవితమంటే ఆశ లేకుండా చేస్తున్నాయి.వాటిలో నుంచే హింసా ప్రవృత్తి ఉద్భవిస్తున్నది. ఆ పరిస్థితులు తరతరాలుగా మార్పులేక వారిలో హింసా ప్రవృత్తి జీర్ణించుకొని పోతున్నది. స్వప్రయోజనా పరులైన రాజకీయ వాదులు వారిని రెచ్చగొట్టి, తమ కనుకూలంగా వాడుకొంటున్నారు.

రాయలసీమలో పరిశ్రమల స్థాపన కుపకరించే పలు రకాల సహజముడి పదార్థాలు విస్తారంగా

కొరవ 8 పేజీలో

## జనవాణి

# అందరూ ఆడవాళ్ళతో అరుదైన అష్టావధానం!

రాష్ట్రంలోనే తొలిసారిగా మహిళా అష్టావధాన ప్రక్రియ ఏర్పాటు చేసిన ఘనతను నెల్లూరు వర్ధమాన సమాజం దక్కించుకొంది. దానికి తగ్గట్టుగానే అష్ట దిగ్గజాల్లాంటి అవధానుల అశేష పాండిత్య ప్రతిభ రసజ్ఞులైన శ్రోతలను సమ్మోహితులను చేసింది. మూడు గంటల పాటు కార్యక్రమం ధారావాహికంగా సాగినా ఒకింత ఉత్సాహంతో పాటు ముగిసిన తరువాత ప్రతి ఒక్క ప్రేక్షకుడూ మానసి కోల్లాసంతో టౌన్ హాల్ బయటకు రావడం స్పష్టంగా కనపడింది.

ఇదో ఐశ్వర్య అవకాశం; మహిళా పధాన ప్రక్రియను దేశంలో తొలిసారిగా దర్శించ బోతున్నా మన్నారు - సభాధ్యక్షునిగా వ్యవహరించిన సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు! ప్రపంచ సాహితీ వినీలాకాశంలో ఎక్కడా అవధాన ప్రక్రియ లేదు; ఒక్క తెలుగు సాహిత్యంలోనే శతావధానం వంటి ప్రక్రియలున్నాయి. కష్టమైన అష్టావధానాన్ని ఓ మహిళ, సాహితీ సౌరభాలు విరజిమ్మే సింహపురి పట్టణంలో చేపట్టడం మరపురాని విషయమన్నారాయన. మహిళా అవధానంలో వీళ్లెందు కయ్యా అని పలువురు నన్ను, గోపాల రెడ్డి గారిని విమర్శించారు; కాని అరవై ఏళ్లు దాటినందు వల్లనేమో ఆడవాళ్ల క్రిందే లెక్కని చమత్కార వ్యాఖ్య చేస్తూ కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామరెడ్డి పరిచయాన్ని ప్రారంభించారు. సైన్సు గ్రాడ్యుయేట్ అయిన అవధానిని శ్రీమతి ప్రభావతిని ప్రశంసించను మాటలు చాలడం లేదని ముగించారు.




అవధాన సభలో ప్రసంగిస్తున్న బెజవాడ గోపాలరెడ్డి, అవధాని ప్రభావతి, మరుపూరు కోదండ రామరెడ్డి

## నెల్లూరు సంగతులు

అనంతరం అవధానిని శ్రీమతి ఎం.కె. ప్రభావతి సమస్త దేవతలను, సాహితీ స్ఫూర్తి ప్రదాతలను స్మరిస్తూ; వుద్యమాలకు వూపిరి పోసిన నెల్లూరు పట్టణ నడిమిటన, నెరజాణలుగా పేరొందిన మహిళల నడుమ సాహసానికి శ్రీకారం చుట్టను ప్రయత్నిస్తున్న స్త్రీలకు సహకరించమని కోరుతూ అవధానుల ప్రశ్నలకు ఎదురు నిలచారు. నిషిద్ధాక్షరి చేపట్టిన శ్రీమతి సి. వసుంధర దూబగుంటలో విజయవంతమైన సారా వుద్యమం పై పద్యం సంధించ మన్నారు. అవధానికి సవాల్‌గా నిలచే ఈ విభాగంలో ప్రభావతి విజయం సాధించ గలిగారు.

'భామయు, భావ యుంగ లియ బాలుడు పుట్టెను సత్యభామకున్' అనే సమస్య సృష్టించిన శ్రీమతి సీతాలక్ష్మికి లింగమార్పిడి భావార్థమిచ్చే పద్యం చెప్పి మెప్పించారు. కామి, గామి, లేమి, - నేమి పదాలు చివరిలో వచ్చేటట్లు వరూధిని ప్రవరుడు వదలి వెళ్లిన తరువాత పడిన బాధ వర్ణించ మనగా కడు చక్కని రసరమ్య జాలం నిండిన పద్యంలో పూరించి ఆకట్టుకొన్నారు. శ్రీరాముడు అగ్ని ప్రవేశం కోరిన సీత స్థానంలో సిల్క్‌స్మిత వున్న ఏమి చేసెదో వర్ణించమన్న వాగ్బంధాన్ని శ్రీమతి ఎన్. సుబ్బలక్ష్మి సంధించారు.

ఏమీ రామ! నమ్మవేమి? నన్ను అగ్ని కోరను గాక యయ్యది నీ పని నిక్కమైన ప్రేమ నీవు చూపుమనే ఛంగుతిన్న సమాధాన మిచ్చారు.

భారతీయ సంస్కృతి - పాశ్చాత్యాను కరణ పై ఆశుపద్యం చెప్పుమని శ్రీమతి కురువాడ లలితమ్మ కోరినంతటనే 'చీర పాత బడియె -

కొరవ 8 పేజీలో



## శపథం తీసుకొందాం!

—ఆచార్య రంగా

[ఈ అరవయ్యేళ్ల నుంచి జమీన్‌రైతుకు హితులు, గురువు, మార్గ దర్శకులు ఆచార్య రంగా గారే, మా పత్రికతో ఆయనకున్నంత అనుబంధం మరెవ్వరికీ లేదు. స్వర్గీయ నెల్లూరు శ్రీరామమూర్తి గారి మరణం పట్ల ఆయన తన అనారోగ్య కారణంగా ఆలస్యంగా పంపిన ఆవేదనా భరిత సంతాప సందేశం ఇది]

స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారు, జమీన్‌రైతు ఉద్యమం, జమీన్‌రైతు పత్రికలతో నా స్నేహం షష్టి పూర్తి నందుకొన్నది. అది కొద్ది రోజులు క్రితం దివంగతులైన శ్రీరామమూర్తి గారితో అనలు పెనలుగా పెరిగి, రైతు కూలీలకు, ముఖ్యంగా జమీన్‌రైతులకు ఎన్నో సేవలందించే భాగ్యం మాకు ప్రసాదించినది. శ్రీరామమూర్తి గారు రామానాయుడు గారిచే పత్రికా రంగమున రచయితగా, సంపాదకునిగా, ఇంకా ఎన్నో విధములుగా సానబట్టిన రత్నముగా తయారు చేయబడినారు. నెల్లూరు జిల్లా రాజకీయ విశ్లేషణలో ఎంతో చాతుర్యమును జమీన్‌రైతు పత్రిక ద్వారా ప్రజల కందించి మేధావి యైన సంపాదకునిగా ప్రతిష్ఠ పొందినారు. ఆ ప్రసిద్ధి ననుసరించి, ఆకర్షింపబడియే నెల్లూరు జిల్లా వాడైన శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రి అయినారు. జమీన్‌రైతు పత్రికకు స్థిరాస్తి అయిన ఆఫీసు స్థలము, భవనము ఏర్పర్చ గల్గినారు. నెల్లూరు జిల్లా రాజకీయ అతిరథ మహారథులైన బెజవాడ గోపాల రెడ్డి, మరుపూరు కోదండ రామరెడ్డి గారల మాటల, చేతల సహాయం అందుకో గల్గినారు. ఇంతటి ప్రముఖ రచయిత, సంపాదకునితో నేను ప్రజా సేవలో భాగస్వామినై నందుకు గర్వపడెడి వాడను. ఆయన తన చిన్ననాడు రామానాయుడు గారు, నేను, భారతి దేవి గారు, పొణకా కనకమ్మ గారు నడిపిన 60 సంవత్సరముల నాటి రైతాంగ పోరాట చరిత్ర నెంతో చక్కగా, యువకుల కూపునిచ్చునట్లుగా పాఠక లోకమున కందించినది చూచి నేనెంతో మురిసి పోయెడి వాడను. ఇట్టి నా ప్రేమాస్పదుడు, రచయిత, సంపాదకుడైన మిత్రుని మరణ వార్త పత్రికలో చదివి నేనెంతో దిగులు చెందినాను. నేను స్వయముగా మీ వద్దకు వచ్చి కుటుంబ సభ్యులతోను, మిత్ర బృందంతోను దుఃఖములో భాగము పంచుకొన దలచితిని. కాని నేనిప్పుడున్న అనారోగ్య పరిస్థితిలో యింటిలోనే కాలు కదుపలేని పరిస్థితిలో వుండి రాలేక పోయినందు లకమిత విచారము నందుచున్నాను. ఇట్టి పరిస్థితిలో యే మహోదాశయ సాధన కోసం జమీన్‌రైతు పత్రికను ఎన్నో కష్టనష్టములతో శ్రీరామమూర్తి గారు నడిపినారో, ఆ పత్రిక సేవా సందేశములను ప్రజలకంద జేయుటకు ద్విగుణీకృతో త్సాహముతో మనందరము కృషి చేయుటకు శపథము తీసుకొందుము గాక. ఇదియే వారి ఆత్మకు శాంతి చేకూర్చ గలదని నా యాశయము.

—ఎన్. జీ. రంగా

## సణుగుడు

### * ఎన్నికల భయం పట్టుకున్నదా— అంత కష్టపడి తిరుగుతున్నారు?

### * నాయకుల నోటి శుద్ధికి ఫినాయిల్ కనిపెట్టలేరా?

ఈ మధ్య వున్నట్లుండి మన నెల్లూరు నాయకులకు తమ నియోజక వర్గాల పట్ల, ప్రజల పట్ల అపరిమిత అనురక్తి జనిస్తున్నది. మూడు ముప్పాతిక సంవత్సరమూ హైదరాబాదులో మంత్రిత్వాల ప్రయత్నంలోనే, సెక్రటేరియట్‌లో పైళ్ల కొలువు లోనే, స్వంత వ్యాపార నిమగ్నతలోనో ఏమారి వుండిన ఎమ్మెల్యేలు, ఎమ్మెల్యేలు కాదల్చుకున్న వారు, ఛాన్సు దొరికి టికెట్ చేజిక్కితే బాగుండునని కలలు కనే వారు అందరూ వూళ్ల పై పడుతున్నారు. ప్రజల కోసం ప్రజలతోటి, ప్రజలతో కలసి వుండడమే తమ రాజకీయ విధానమని నమ్మ బలకడానికి, నమ్మించడానికి పడరాని పాట్లు పడుతున్నారు. ఇళ్ల దగ్గర ఒక్క నాయకుడూ దొరకడం లేదు. పొద్దు పొడవక ముందే పరుగులు పెట్టి పల్లెల్లో దర్శనమిస్తున్నారు. ప్రజల సమస్యల పట్ల ఎక్కడలేని ఆసక్తి, ప్రజల పట్ల ఎప్పుడూ లేని అనురక్తి కన్పరుస్తున్నారు. ఎన్నికల జ్వరం ఎంత తీవ్రంగా కాయనిదే వీరిలో ఇంతటి ప్రేమ పుట్టుకొని వస్తుంది?

డోలేంద్ర

ఎప్పుడో సంవత్సరం పాతిక దూరంలో వున్న శాసన సభా ఎన్నికల పట్ల నాయకులలో ఇంతటి భయం ఎందుకు పట్టుకున్నది? జన చైతన్య యాత్రల పేరిట తెలుగుదేశ మీయులు, ప్రజా సన్నిహిత యాత్రల రూపంలో కాంగ్రెస్ వీయులు కాలికి బలపం కట్టుకొని తిరగడం లోని అవసరమేమిటి? పత్రికలలో ప్రకటనల యుద్ధం ప్రారంభించే వలసిన అగత్యం ఏమి వుంది?

# నెల్లూరు నలుచెరగుల్లో విదూషకుడు

## పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య 1 తేది వరకు నెల్లూరులో గడిపి, రైలెక్కారు.

ఇక నుంచి పెంచలయ్య గారు హైదరాబాదులో వుండే కార్యక్రమం ప్రకటించడం యేలింటారా?

## మంత్రులు

ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు గారి దర్శనం కోసం రాష్ట్ర మంత్రులు శ్రీ జె.సి. దివాకర రెడ్డి, శ్రీ సాంబశివ రాజు 31 తేది నెల్లూరు వచ్చి, అదే రోజు తిరిగి వెళ్లిపోయారు.

## రంగడి గుడిలో పవిత్రోత్సవాలు

నెల్లూరు రంగనాథ స్వామి దేవస్థానంలో 28 నుంచి మూడు రోజుల పాటు పవిత్రోత్సవాలు జరిగాయి. పదేళ్లకు పై నుంచి నిల్చిపోయి వుండిన ఉత్సవాలివి. వేలప సంఖ్యలో భక్తులు హాజరైనారు.

## 'నిర్మల'లో దోపిడీ

ట్రంకురోడ్డులోని నిర్మల ఏజెన్సీస్ ఎలక్ట్రానిక్ అంగడిలో 1 తేది రాత్రి పెద్ద దోపిడీ జరిగింది. భవనం వెనుక తలుపు పగులగొట్టి లోపల దూరి విసిఆర్‌లు, టేప్ రికార్డర్ల వంటి వస్తువులు ఎత్తుకెళ్లారట. నష్టం లక్షా చిల్లరని అంచనా.

ట్రంకురోడ్డులో; అంతంత పెద్ద వస్తువులు ఎవరి కంటా పడకుండా తరలించ గలిగారంటే ఆ దొంగలెవరో తెలివైన వారే.

## ఉద్యోగుల సమ్మె

టౌన్‌లోని బ్యాంకులు, ఇన్సూరెన్స్ కంపెనీ ఉద్యోగులు 2 తేది సమ్మె చేశారు. ఒక్క బ్యాంకూ పని చేయలేదు. పెన్షన్, వేతన సవరణలు వీరి కోరికలు.

బ్యాంకు ఉద్యోగులకు కోరికలుంటాయా? వుండాలా?

## సంగీత నృత్యోత్సవం

నాగపూర్ సాంస్కృతిక కేంద్రం, మన సమాచార సాంస్కృతిక సంబంధాల శాఖ కలిసి సంయుక్తంగా నెల్లూరులో 3 నుంచి 6 తేది వరకు సంగీత నృత్యోత్సవాలు నిర్వహిస్తున్నాయి. ప్రతి రోజూ సాయంత్రం 6.30 నుంచి 9 గంటల వరకు టౌన్‌హాలులో కార్యక్రమా లుంటాయి. కళాకారు లందరూ యువతీ యువకులు; జాతీయ స్థాయిలో తమ ప్రతిభ నిరూపించు కున్న వారు. సంగీత నృత్య రూపకాలు రెండింటిలోనూ నవీన ప్రక్రియలనుసరించి ప్రదర్శనలు రూపొందించారు. రసజ్ఞులకు పసందైన కనువిందు.

## వ్యాపారుల బంద్

టర్నోవర్ ట్యాక్స్‌కు నిరసనగా 5 తేది నుంచి రాష్ట్ర వ్యాప్తంగా అన్ని వ్యాపారాలూ బంద్ కానున్నాయి. మూడు రోజులు జరిగే ఈ బంద్‌లో ఫ్యాన్సీ అంగళ్ల నుంచి ప్రొవిజన్ స్టోర్స్ వరకు, సిమెంట్ షాపుల నుంచి బంగారు షోరూంల వరకు సర్వం మూత పడనున్నాయి. ఈ లోగా ప్రభుత్వంతో రాజీ కుదిరితే తప్ప ప్రజలకు పాట్లే!

## వినాయక చవితి చక్కెర

వినాయక చవితి కానుకగా టౌన్‌లు, తాలూకా కేంద్రాల వారికి రోజ్ కార్డుకు 6 కిలోలు, తెల్లకార్డుకు రెండు కిలోలు; ఇతర పల్లెల్లోని వారికి 4 కిలోలు, ఒక కిలో లెక్కన లెవీ చక్కెర పంపిణీ చేస్తారు.

## వాన కోసం యజ్ఞం

సిద్ధి వినాయకుడ్ని సంతృప్తి పరచి, వానలు కురిపింప జేసేందుకు స్టోన్‌హౌస్ పేట వినాయక దేవాలయం, పాండురంగ అన్నదాన సమాజం ధర్మకర్తల మండలులు 5 తేది ఒక జలయజ్ఞం చేయనున్నాయి. 108 మంది బ్రాహ్మణులు పెన్నానది నుంచి 108 కలశాలతో నీళ్లు తెచ్చి వినాయకుడ్ని అభిషేకిస్తారు.

వాన వచ్చే రోజు చూసుకొని ముహూర్తం పెట్టుకొని వుంటే బాగుండేదేమో– దేముడి పరువుకు భంగం కల్గకుండా!

## కాళిదాస జయంతి

సాహితీ సదస్సు ఆధ్వర్యంలో స్వర్గీయ గుర్రం వేంకట సుబ్రహ్మణ్యం స్మృత్యంకంగా కాళిదాస జయంతి సభ 4 తేది సాయంత్రం టౌన్ హాల్‌లో జరుగుతుంది. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు అధ్యక్షిస్తారు; వెంకటేశ్వర విశ్వ విద్యాలయం సంస్కృత శాఖ అధిపతి ప్రొఫెసర్ యుబి రఘునాథా చార్య కాళిదాసు పై ప్రసంగించి, సన్మానం స్వీకరిస్తారు. అందరూ వచ్చి, హాలు నింపాలని గోసుకొండ వారి అభ్యర్థన.

## కోరమాండల్ నెల్లూరులో ఆగుతుందా?

కోరమాండల్, కెకె, మంగళ ఎక్స్‌ప్రెస్‌లను నెల్లూరు స్టేషన్‌లో రెండేసి నిముషాలు నిలపాలని దక్షిణ మధ్య రైల్వే జోనల్ కమిటీ సమావేశం తీర్మానించింది. ఈ మేరకు ప్రతిపాదనలను రైల్వే బోర్డుకు పంపారు. రైల్వే జనరల్ మేనేజర్ అధ్యక్షతన జరిగిన ఆ కమిటీ సమావేశంలో నెల్లూరుకు సంబంధించి ఇంకా పలు నిర్ణయాలు తీసుకున్నారు. ఒమ్మిన సుబ్రహ్మణ్యం గారు వాటన్నింటినీ మాకు చెప్పారు – పై వారం మీకు చెప్తాం.

## కృష్ణాపట్నంలో గ్రీకు నౌక

కృష్ణాపట్నం రేవులో లంగరు వేసి వున్న గ్రీకు నౌక అలెగ్జాండర్ నుంచి యూరియా దిగుమతి ప్రారంభమైంది. నాగార్జున కెమికల్స్ అండ్ ఫర్టిలైజర్స్ వారి తరఫున రష్యా నుంచి 28 వేల 650 టన్నుల యూరియా తెచ్చిందిది. మన నాయుడు

కొరవ 6 పేజీలో



**In the Court of the Principal Subordinate Judge of Chittoor.**

S.C.No. 368/92.

E.V. Payani ...Plaintiff.
Jeevanandam ... Defendant.

**Notice to the Defendant**

Jeevanandam,
S/o Krishnasai,
Murukambat Post,
Chittoor Mandal.

Please take notice that the above S.C. No. 368/92 is posted to 23-9-1993 for your appearance before the Principal Subordinate Judge Court, Chittoor at 10.00 a.m. and to file objections if any in the matter. If you fail to attend before the said court on the above said date and time, the matter will be decided exparte.

S. Janardhan Naidu
Advocate for Planintiff.

**In the Court of the Principal Subordinate Judge, Chittoor.**

S.C. No. 367/92.

Between:
E.V. Payani - Plaintiff.
And:
Meghanadham - Defendant.

**Notice to the Defendant**

To
M.D. Meghanadham,
S/o. M.S. Dharmalingam,
Police Constable,
Murukambat Post,
Chittoor Mandal.

Sir,

Please take notice that the above suit is posted to 23-9-1993 for your appearance and to file objections if any before the Principal Subordinate Judge Court, Chittoor. If you fail to appear either in person or through Advocate on the said date before the said court, the matter will be decided exparte.

S. Janardhan Naidu
Advocate for Plaintiff.

**జమీన్‌రైతు**
సంవత్సర చందా రు 100/-
6 నెలలకు - రు 50/-
విడిప్రతి - రు. 2.00



**తాళాలు పోయాయి!**

నెల్లూరు, దర్గామిట్టలో కారుకో పెట్టి వుంచిన తాళాల గుత్తి (వచ్చు పంది కీ బంచ్‌లోవివి) పోయాయి - అవి గూడూరులో ఎవరి చేతికో చేరినట్లు సమాచారం. దొరికిన వారు మాకు తెలిపితే స్వంత దారు నకు చేరుస్తాము.

మేనేజర్ - జమీన్‌రైతు
నెల్లూరు - 524 004.
ఫోన్: 27354

## గుంటూరు జిల్లా 1వ అదనపు మున్సిఫ్‌కోర్టులో

E.P. 476 / 89
O.S. 2960 / 78

Union Bank of India,
Guntur - DHr
and
Gudiwada Venkaiah
anothers JDrs

### వేలం ప్రకటన

పై నంబరు డిక్రీ బాకీ వసూలు నిమిత్తం ఈ క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పై కోర్టు వారి వలన 20.9.93 తేది ఉదయం 10.30 గంటల నుండి వేలం వేయబడును. పాటలు పాడదలచు కొన్నవారు పై తేదిన కోర్టుకు హాజరు కావలెను.

### షెడ్యూలు

గుంటూరు డిస్ట్రిక్టు గుంటూరు సబార్డినేటు కోర్టు గోరంట్ల గ్రామ పంచాయితీలోని 1వ ప్రతివాది గుడివాడ వెంకయ్య తాలుకు వేలం కావలసిన ఇల్లు స్థలమునకు హద్దులు

తూర్పు: వెడల్పు గల జాయింట్ బజారు హద్దు 53'; దక్షిణం: గుర్రాల సుబ్బయ్య యింటి గోడ 46'; పడమర: రెండవ ప్రతివాది తోట సత్యనారాయణ స్థలం 70 1/2'; ఉత్తరం: యర్రంశెట్టి చిన వెంచయ్య వగైరాల 3 అడుగుల వెడల్పు గల గల్లి42'

ఈ హద్దుల మధ్య స్థలము అందలి ఇల్లు రాతి గోడలతో సహా.

వాటి కిమ్మత్తు రూ. 61,000/-
అహినా కిమ్మత్తు రూ. 10,000/-

**కానాధిభట్ల శ్రీనివాస మూర్తి**
DHr తరపు అడ్వొకేటు

## సొందాయమ్మ

(2 పేజీ కొరవ)

నాలుగు నెలల క్రితం తడ గ్రామానికి చెందిన నిర్మల అనే పేద యువతి, సొందాయమ్మ దగ్గరకు వచ్చి తన బిడ్డను తనకు తిరిగి ఇవ్వమని నిలదీయడంతో ఈ కుంభకోణం వెలుగులోకి వచ్చింది. సారాయికి బానిసైన తన భర్త శ్రీనివాసులును ప్రలోభ పెట్టి, తన బిడ్డను తీసుకున్నదన్నది నిర్మలమ్మ ఆరోపణ. అయితే జూన్ చివరి వారంలో తడకు వచ్చిన కలెక్టర్ వద్దకు తొండూరు గ్రామం మహిళ మస్తానమ్మ తన కుమారుడిని సొందాయమ్మ నుంచి తిరిగి ఇప్పించమని రోదిస్తూ ప్రాధేయ పడడంతో విషయం రచ్చకెక్కింది. ఆ తర్వాత నాయుడుపేటకు చెందిన దేవి, ఒజిలికి చెందిన మునిరత్నం అనే మహిళలిద్దరు కూడా తమ పిల్లలు సొందాయమ్మ వద్ద వున్నారని ఫిర్యాదు చేశారు.

మస్తానమ్మ, తడలోని ఒక ఫ్యాక్టరీలో పని చేస్తుండిన అజిత్ సింగ్ అనే యువకుడ్ని ప్రేమించి, పెళ్లికి ముందే గర్భవతి అయిందట. అతడామెను వదిలేశాడు. ఆవేదనా పూరిత పరిస్థితులలో సూళ్లూరుపేట ఆస్పత్రిలో కాన్పు కాగానే తన బిడ్డను సొందాయమ్మకు అప్పచెప్పింది. ఆ బిడ్డను హైదరాబాదులో వుంచి పెంచుతామని సొందాయమ్మ హామీ ఇచ్చిందట. అయితే ఆ తర్వాత మనసు మార్చుకొని తన బిడ్డను తనకు తిరిగి ఇవ్వమని బ్రతిమలాడినా ఇవ్వలేదని, చనిపోయాడని చెప్పిందని, పత్రికా వార్తలు చూసి పోలీసులకు ఫిర్యాదు చేస్తే తన బిడ్డ విదేశాలలో వున్నాడని తెలిసిందని మస్తానమ్మ రోదన.

చదువు చెప్పించి, బాగు చేస్తానంటే ఇచ్చాను కాని, నా బిడ్డ నాకు బరువా అంటున్నది - నాయుడుపేటకు చెందిన శ్రీమతి దేవి. మూడేళ్ల వయస్సులో సొందాయమ్మ ఆమె పాపను తీసుకున్నదట. భర్త తనను వదిలేయడం, బిడ్డ ఆరోగ్యం దెబ్బ తిని వైద్యం చేయించలేక పోవడంతో దిగులుపడి సొందాయమ్మకు అప్పచెప్పానని, కొంత కాలం తర్వాతతిరిగి ఇవ్వమంటే విదేశాలలో దర్జారా వున్నదని ఫోటో చూపించిందని, ఎట్లయినా తన బిడ్డను తనకు తిరిగి ఇప్పించాలని ఆమె అడుగుతున్నది. లేకుంటే నిరాహారదీక్ష చేస్తానని చెప్తున్నదామె.

ఏదో ఒక కారణంతో పిల్లలను అప్పచెప్పి, ఆ తర్వాత తిరిగి ఇమ్మని అడిగే తల్లులు చాలామందే వున్నారు. కాని సొందాయమ్మ వారినెవరినీ పట్టించుకోలేదు. తడకు చెందిన ఒక్క నిర్మల మాత్రం అది సాధించుకున్నది. కలెక్టర్ జోక్యంతో సొందాయమ్మ, ఆమె ఎనిమిది నెలల పసికందును తిరిగి అప్పచెప్పింది. అప్పటి నుంచి తనకు బెదిరింపు లెక్కువైనాయని, సొందాయమ్మ బంధువైన ఆరోగ్యస్వామి అనే స్థానిక రౌడీ తమను చంపుతానని భయ పెడుతున్నాడని నిర్మల దంపతులు ఆరోపిస్తున్నారు.

ఈ మొత్తం వ్యవహారంలో పలు అనుమానాస్పద విషయాలు గోచరమౌతున్నాయి. సొందాయమ్మ ఇప్పటి వరకు ఎందరు పిల్లలను సేకరించింది? వారిని ఎక్కడెక్కడ వుంచింది? అనాథాశ్రమం అనే బోర్డు తప్ప అనాథలెవర్నీ తన దగ్గర వుంచుకోకుండా ఎక్కడెక్కడికో పంపే అధికారం సొందాయమ్మకు ఎవరిచ్చారు? పిల్లలను తల్లిదండ్రుల నుంచి తీసుకునేటప్పుడు ఆమె వారికి డబ్బు దస్కం ఏదైనా ముట్ట చెప్పిందా? లేక మంచి మాటలతో తెచ్చేదా? పిల్లలను విదేశాలకు పంపడానికి ఆమెకు ఎట్లా వీలు కల్గింది? అమెరికన్లతో ఆమెకు సంబంధం ఎట్లా ఏర్పడింది? వారికి పిల్లలను అమ్ముతున్నదా? లేక దత్తత ఇస్తున్నదా? అమెరికన్లు ఈ పిల్లలను ఎందుకు తీసుకవెళ్తున్నారు. పెంచుకోవడానికా? లేక పని మనుషులుగా వాడుకోవడానికా?

సొందాయమ్మ వద్ద లక్షల ధనం వుంది. ఆమె అనాథాశ్రమానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలేవీ నిధులివ్వడం లేదు. విదేశీ సంస్థల నుంచి నిధులు అందుతున్నట్లు రికార్డులలో ఎక్కడా లేదు. కాని నాయుడు పేటలోని సిండికేట్ బ్యాంకు బ్రాంచి (అకౌంట్ నంబరు 405) లోని ఆమె ఖాతాలో 89లో ఒకసారి లక్షా 15 వేలా 157 రూపాయలు, 92 లో ఒకసారి 3 లక్షలా 94 వేలా 602 రూపాయలు జమ అయ్యాయి. అదే బ్రాంచిలోని మరో అకౌంట్‌లో (నంబరు 15447) అప్పుడప్పుడు పెద్ద పెద్ద మొత్తాలు (డ్రాఫ్టుల రూపంలో జమపడి వున్నాయి. ఆమె భర్త జాన్ సుహాసం పేరుతో వున్న అకౌంట్‌లోనూ (నంబరు టి - 109) 62 వేలు వంటి పెద్ద మొత్తాలు జమైనాయి. ఈ డబ్బంతా ఎక్కడ నుంచి వచ్చింది? ఎందుకు వచ్చింది ? ఎవరు ఇచ్చారు? అనాథాశ్రమం నిర్వహణకు విదేశాల నుంచి వచ్చిందా? లేక పిల్లల అమ్మకంతో సమకూరిందా? సొందాయమ్మకు తడలో పెద్ద స్కూలు భవనం వుంది. నాయుడుపేటలో రెండంతస్తుల మేడ వుంది. ఒక అనాధగా జీవితం ప్రారంభించిన ఆమె ఇంత ఆర్జన చేయడం వెనుక మిస్టరీ ఏదో వుందని అనుమానించడంలో ఆశ్చర్యమేమీ లేదు. కొరవ మరువారం

## సణుగుడు

(4 పేజీ కొరవ)

ఎంత తరచి చూచినా జనం నాడి అంతు బట్టక పోవడమే పదవీ ప్రియులలో గుబులు కల్గిస్తున్న ట్లుంది. నిజమో కాదో నిరూపించడం కష్టం కాని, కాంగ్రెస్ పట్ల జనానికి ముఖం మొత్తేసిందన్న ప్రచారం మాత్రం జోరుగా జరిగి పోతున్నది. కోవూరు ఎన్నిక ఆ భయాన్ని పెంచింది. అందువల్లే కాంగ్రెస్ ఎమ్మెల్యేలలో ఆ కలవరం. మొదట జనార్ధన రెడ్డి గారు రచ్చబండ సమావేశాల పేరుతో వెంకటగిరి కొండలు, అడవులు కూడా వదలి పెట్టకుండా తిరిగారు. ఏసి సుఖం వదులుకొని ఒక్కొక్క రోజు చెట్ల క్రింద నులక మంచాల పై కూడా ఎర్రటి ఎండలో కునుకు తీశారు. సర్వేపల్లి ఎమ్మెల్యే శ్రీ సి.వి. శేషారెడ్డి గురువు నడచిన దారిలో అడుగులేస్తున్నారు; వూరూరా తిరుగుతున్నారు. గెటప్ కూడా కొత్తదండోయ్– ఖద్దరు ప్యాంటు, అర చొక్కాలతో అందంగా తయారై మరీ చక్కర్లు కొడుతున్నారు. అద్ద పంచె కడితే ముతక మనిషిగా భావిస్తున్నారని భావించారేమో మరి; కొత్త పెళ్లి కొడుకు మాదిరి ముస్తాబై వస్తున్న తమ ఎమ్మెల్యేను చూడడానికి గ్రామాల్లో జనం ఇళ్లు వదలి బయటకు వస్తున్నారు.

అయ్యప్ప వ్రత దీక్షా బద్ధులైన మాదాల జానకి రాం గారు భారమంతా శబరిమలై స్వామికి వదిలి మానవ ప్రయత్నంగా చుట్టపు చూపు విజిట్‌లు చేస్తున్నారు. యానాదిరెడ్డి గారికి శివుడి పై అపార గురి; ఆయన ఆజ్ఞ వస్తే ఓట్లేయక చస్తారా జనం అని వళ్లు అలవకుండా ఇంటి పట్టునే వుండి వచ్చే పోయే వారిని కుశల ప్రశ్నలేస్తున్నారు. ఆయన మన సంతా మంత్రిత్వ పదవీ పరిష్వంగ నాభిలాషతో నిండి, విరహ వేదనతో కుమిలి పోతున్నారు. ఎన్నికల భయం అందులో దూరడానికి సందు లేదు. వెంకట రత్నం నాయుడు గారికి అనారోగ్యం; విష్ణు వర్ధన రెడ్డి కి పోస్ట్ ఆపరేటివ్ రెస్ట్; పెంచలయ్య మాత్రం సందు వదలడం లేదు. మంచి నీళ్ల బోరు వేస్తున్నా కారేసుకొని పోయి వెళ్లి చూసి వస్తున్నాడు.

తెలుగుదేశం కూడా ఏమీ తీసి పోవడం లేదు. చంద్రమోహన్ రెడ్డి, డేగా నారసింహా రెడ్డి, కొండప నాయుడు వగైరా వగైరాలు పని కల్పించుకొని మరీ వూళ్లకు వెళ్లి వస్తున్నారు. వారికి కాంగ్రెస్ వాదులలాగా పనులు చేయలేదన్న అసంతృప్తి ఎదురు కాదు కదా– అందుకని నోటి దురద తీరా తిట్లు, దండకాలు చదివి, చల్లగా వచ్చేస్తున్నారు.

ఈ నాయకుల తీరు చూస్తుంటే - ఎన్నికలు ఐదేళ్ల కొకసారి కాకుండా ఏడాది కొక మాటు జరిపిస్తే బాగుంటుదన్పించడం లేదూ?

* * *

నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారు లేని లోటును ఆయన మేనల్లుడు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి మరిపింప జేస్తున్నారు. అంతా మేనమామ పోలికే. ఆవేశం కన్పడకుండా, మెల్లగా మెల్లగా మాట్లాడుతూనే ఎదుటి వాడి మూలుగలు నలిగి పోయేలా నిందలు కురిపించే విద్యలో ఏ మాత్రం తీసి పోవడం లేదు. చంద్రమోహన రెడ్డి, పసల పెంచలయ్య, సివి శేషారెడ్డి, ఎల్లసిరి శ్రీనివాసుల రెడ్డిల మధ్య తరచు జరుగుతున్న విమర్శనా ప్రకటనల యుద్ధాన్ని చూస్తుంటే మన నాయకుల నోరు శుద్ధి చేయడానికి ఏ శాస్త్రజ్ఞుడైనా ఫినాయిల్ కనిపెట్ట లేడా అన్పిస్తుంది. నువ్వెంత తిన్నావు, నువ్వెంత తిన్నావు అనే నిందలే తప్ప వీరికి ప్రజలు, ప్రజల సమస్యలు పట్టేటట్లు లేరు. ప్రజాధనం మన నాయకు లెవరికైనా పటిక బెల్లంతో సమానం. ఛాన్సు దొరకక నిజాయితీ పరులేకాని, సిరి వస్తుంటే వద్దనే నీతి పరులెవ్వరూ లేరు. ఆ సంగతి ప్రజలందరికీ తెలుసు. ఇంకెందుకీ వ్యర్థ విమర్శలు పత్రికలో స్పేసు నింపడానికి తప్ప!

## పెండ్లిండ్లు

(7 పేజీ కొరవ)

సత్యసాయి నిగమాగమంలో జరిగింది. మనిషి లేక పోయినా ఆయన మంచి తనం మర్చిపోలేని నెల్లూరు విద్యుతుద్యోగులు, అధికారులు పలువురు కార్యభారం మోసి గురు భక్తి చాటుకున్నారు.

* * *

స్టాండర్డ్ ప్యాకేజింగ్స్ పరిశ్రమ యజమాని, "వాత్సల్య" పేరుతో అనాథ పిల్లలకు ప్రత్యేక సంస్థ నెలకొల్పి సమాజ సేవ చేస్తున్న వదాన్యుడు, సంపద ఎంత పెరిగినా పైకి సామాన్యంగానే కన్పించే నిరాడంబరుడు శ్రీ గోరంట్ల రాధాకృష్ణ కుమార్తె సంగీత లక్ష్మి, కోయంబత్తూరులో శ్రీ జి. శ్రీధరన్ కుమారుడు ఎస్. బాలాజి వివాహం 29 తేది టిటిడిలో రంగ రంగ వైభవంగా జరిగింది. టిటిడి కల్యాణ మండపాన్ని ధగధగా యమానంగా అలంకరించి దారిన పోయే వారి కళ్లు జిగేల్ మన్పించారు.

* * *

నెల్లూరు అసిస్టెంట్ కమర్షియల్ ట్యాక్స్ ఆఫీసరు, మాట కలుపుగోలు తనం, మంచి తనంతో జిల్లా వ్యాప్తంగా అపార స్నేహ బృందాన్ని ఏర్పర్చు కో గల్గిన మంచి మిత్రుడు, సతత ధవళ వస్త్రధారి, సదా మంద స్మిత వదనుడు, అన్నిటినీ మించి లౌకికుడు శ్రీ సూరేపల్లి చెన్నయ్య కుమారుడు కిషోర్ బాబు, గూడూరు, శ్రీ డి. బాలకృష్ణయ్య కుమార్తె శైలజల పరిణయం ఆగస్ట్ 1 తేది ఆదెప్ప నాయుడు అతిథి భవనంలో జరిగింది.

## నెల్లూరు ముచ్చట్లు

(5 పేజి కొరవ)

దశరథ రామరెడ్డి గారు వాటిని కాకినాడ నాటు పడవలలో వడ్లుకు చేర్చి, రీ ప్యాకింగ్ చేస్తున్నారు. ఈ కార్యక్రమం మరొక పదిహేను రోజులు జరుగుతూంది.

దశరథ రామ రెడ్డి తాపత్రయం, శ్రద్ధలే తప్ప ఒక్క జిల్లా నాయకుడూ, అధికారీ కృష్ణపట్నం ఓడరేవు గురించి పట్టించు కోవడం లేదు. తన వ్యాపార లాభం కోసమే అయినా ఎన్‌డిఆర్ జిల్లాకు ఏ రాజకీయ వాదీ చేయలేని సేవ చేస్తున్నారు.

## పంచాంగము

### సెప్టెంబరు తిథులు

అధిక బాద్ర పద బహుళ

| | |
|---|---|
| తే 4 శని తదియ ప.గ | 12.18ప |
| తే 5 ఆది చతుర్థి ప.గ | 2.20 ప |
| తే 6 సోమ పంచమి ప.గ | 4.26ప |
| తే 7 మంగళ షష్టి సా.గ. | 5.26ప |
| తే 8 బుధ సప్తమి సా.గ. | 6.20ప |
| తే 9 గురు అష్టమి సా.గ. | 6.48ప |
| తే 10శుక్ర నవమి సా.గ. | 6.41ప |

**స్వయంపాకుల శ్రీనివాసులు,**
ఎం.ఏ

జిల్లా వార్తలు

# ముందు చూపు వుండి వుంటే మంచి నీళ్ల కరువుండేది కాదు!

కావలి టౌనుకు మంచి నీటి కరువు పెరగనుంది. ఏటేటా జనాభా పెరిగి పోతూంది; అదనంగా మంచి నీటి పథకాలు మాత్రం రావటం లేదు. ఇక కరువు కాక, నీరు కొల్లబోతాయా? టౌన్ జనాభా లక్ష దాటిందని అంచనా. నీటి సౌకర్యం 30, 40 వేలకు మించి లేదు. బావుల్లో జలపూరితేనే జనం దాహం తీరేది. సూర్య భగవానుడు ఆంధ్రదేశం పై కక్ష గట్టి వుండటంతో బావుల్లో జల పూరణం తగ్గుదల. దినదినానికి అడుగంటి పోతున్నది. తత్ఫలితంగా పౌరుల దాహం పెరిగి పోతున్నది.

మునిసిపాలిటీ సరఫరా చేసే నీరు టౌన్‌లో మూడవ వంతు అవసరాలకూ చాలడం లేదు. కుళాయిలకు పంపులు, మోటార్లు బిగించి కొందరు స్థితి పరులు పైపుల్లోని నీరు పూటి పారేస్తున్నారు. నీటి కుళాయిల పై ఆధార పడే వారికి చుక్క నీరు మిగలటం లేదు. టౌన్‌లోని 20 పెద్ద బావులలో నుంచి డైరక్ట్‌గా నీళ్లు పంపు చేస్తున్నది మునిసిపాలిటీ. తుమ్మల పెంట బావి నుంచి నీరు తోడి కో ఆపరేటివ్ కాలనీలోని ట్యాంకు ద్వారా తుఫాన్ నగర్, కచ్చేరి మిట్టలకు ఇస్తున్నారు. ఈ బావులలోనూ నీరు చాలినంత లేక పోవటం వల్ల రోజుకు అరగంట కూడా సరఫరా వుండటం లేదు. కొత్తగా వేసిన లోతు హ్యాండ్ బోర్లు కొంతకు కొంత అవసరాలు తీరుస్తున్నాయి. వాటి దగ్గర జనం బారులు తీరుతున్నారు.

27 ట్యాంకర్లు రోజుకు 320 ట్రిప్పుల లెక్కన రాత్రీ పగలు నీళ్లు తోలుతున్నాయి. దీనివల్ల రోజుకు ఇరవై వేల రూపాయలు హరించుకు పోతున్నాయి. ఇంకొక ప్రక్క మాగుంట సుబ్బరామ రెడ్డి గారి ఉచిత ట్యాంకరు జనం గొంతులను తడిచేస్తున్నది ఎంత చేసినా కరువు, కరువే!

మార్చి, ఏప్రెల్ నెలల్లో కావలి కాలువ ద్వారా కావలి చెరువును సోమశిల నీటితో నింపితే బావుల్లో వూట పెరిగి, ఇంత బాధ లేకుండా వుంటుంది. పై ఏడాది కైనా మునిసిపల్ అధికారులు ఈ జాగ్రత్త తీసుకోవాలి. చలంచర్ల గ్రామం దగ్గర నూరు ఎకరాల అటవీ భూమి సేకరించి సమ్మర్ స్టోరేజి చెరువు నిర్మించాలన్న ప్రతిపాదన ఒకటి. ప్రభుత్వ దివాణంలో దీర్ఘ నిద్రలో వుంది. ఎమ్మెల్యే గారు దాన్ని బయటకు లాగ గల్గితే కొంతకు కొంత మేలు జరుగుతూంది.

# పేడ దిబ్బలో మంట – ఏడు ఇళ్లు దగ్ధం

ఇందుకూరు పేట మండలం నరసాపురం గ్రామం అరుంధతీయ వాడలో 16 తేదీ ఒక పేడ దిబ్బలో మంటలు పుట్టి, ప్రక్కనే వున్న ఏడు పూరిళ్లు తగులబడి పోయాయి. విచిత్రంగా జరిగింది ప్రమాదం. ఎండకు పేడ లోపలే ఉడికి, గ్యాస్ వెలికి వచ్చిందట. అప్పుడే ప్రక్క ఇంటి నుంచి ఎగిరి వచ్చిన నిప్పురవ్వ దాని పై పడి ఉవ్వెత్తున మంట లేచింది. అవి ఇళ్లకు ప్రాకాయి. నెల్లూరు నుంచి ఫైరింజన్ వచ్చే వరకు పరశు రాముల వారికి పండుగే.

నెల్లూరు రామకృష్ణ సేవాసమితి బాధితులను ఆదుకొని, వస్త్రాలు పంచి పెట్టింది. ఎమ్మార్వో 500 రూపాయల లెక్కన పరిహారం ఇచ్చారు.

# విశ్వోదయ విద్యార్థుల ఆందోళనలో కాలేజి పునాదిరాళ్ల విధ్వంసం!

కాలేజిలో కొరతలు, లోపాలకు నిరసనగా వెంకటగిరి విశ్వోదయ విద్యార్థులు పది రోజుల పాటు జరిపిన ఆందోళన విరమించ బడింది. కాలేజికి తగినన్ని గదులు లేవని, హాస్టలు వసతి కావాలని, లైబ్రరీలో పుస్తకాలు లేవని, అయ్యవార్లు అసలే లేరని, బిఎస్‌సిలో సీట్లు పెంచాలని డిమాండ్ చేస్తూ విద్యార్థులు ఆందోళనకు దిగారు. మొదట రిలే నిరాహార దీక్షతో ప్రారంభమైంది. 23 తేదీ ఆమరణ దీక్ష ప్రారంభించారు. 25 తేదీ టౌన్ బంద్ జరిపారు. బస్సులు, గిన్నెలూ మొత్తం నిలిపేశారు. 21, 22 తేదులలో వెంకటగిరికి వచ్చికూడా తమను పలుకరించ నందుకు నిరసనగా మాజీ ముఖ్యమంత్రి వెంకటగిరి శాసన సభ్యుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి పై విద్యార్థులు ధ్వజమెత్తారు. ఆ కోపంలో వెంకటగిరి క్రాస్ రోడ్డు వద్ద కళాశాల కాంప్లెక్స్ నిర్మాణం కోసం వేసిన శంఖుస్థాపన రాళ్లను, బోర్డులను ధ్వంసం చేశారు. వాటిలో జనార్దన రెడ్డి పేరు వుంది.

అలిమోస్టు రాజకీయ సన్యాసం తీసుకున్నట్లు కోటలో ఇంటికి పరిమితమై వుంటున్న నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డికి ఈ వార్త అమృతోపమానంగా వినిపించింది. పంచె సర్దుకుంటూ పరుగు పరుగున వచ్చి, విద్యార్థుల దగ్గర మొసలి కన్నీళ్లు కార్చి, నేదురుమల్లి జనార్దన రెడ్డిని తిట్టి వెళ్లారు. విద్యార్థుల మీద ఎనసికి ఎంత ప్రేమ!

తర్వాత నెల్లూరు డిడిఒ శ్రీ విష్ణు, గూడూరు సబ్ కలెక్టర్ శ్రీ సునీల్ శర్మ వచ్చి, విద్యార్థులతో చర్చలు జరిపి, హామీలిచ్చి, ఆందోళన విరమింపజేశారు.

## కావలిలో మాగుంట మహిళా కళాశాల

ఎన్నికలలో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చడానికి ఒంగోలు ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారు కావలిలో తన పేర ఒక మహిళా కళాశాల ప్రారంభించారు. నియోజక వర్గ పరిధిలోని అన్ని మండలాలలో జూనియర్ కాలేజీలు పెడతానని అప్పుడాయన మాట ఇచ్చారు. కొన్ని మండలాలలో గత సంవత్సరమే కాలేజీలు ప్రారంభమైనాయి. కావలిలో స్త్రీలకు ప్రత్యేక కాలేజి లేదు కాబట్టి, ఇక్కడ మహిళా డిగ్రీ కళాశాల తలపెట్టారు. ప్రిన్సిపల్, సిబ్బంది నియామకం పూర్తయింది. భవనాలు కట్టే వరకు తాత్కాలికంగా జవహర్ భారతి ఆవరణంలోని కొన్ని గదులు ఇవ్వడానికి రెక్టార్ శ్రీ డిఆర్ సమ్మతించారు. కాని ఎందువల్లనో వాటిని ప్రక్కన పెట్టి, రైల్వే ఫీడర్స్ రోడ్డులోని మునిసిపల్ ఆఫీసు ప్రక్కన ఒక బాడుగ భవనం తీసుకున్నారు. ఇది టౌన్ మధ్యలో వుండేది కాబట్టి, ఆడ పిల్లలకు అనుకూలం. ఈ ఏడాది బిఎస్‌సిలో ఎంపిసి, బిజెడ్‌సి, బిఎలో హిస్టరీ, ఎకనామిక్స్, పయోజన విద్య, పాలిటిక్స్ కోర్సులు ప్రవేశ పెట్టారు. పై ఏడాదికి కాలేజి పూర్తి స్థాయిలో నడవ గలదని అంచనా. ఇప్పుడు చేరిన పిల్లల సంఖ్య చాలా తక్కువ.

## గూడూరు రోటరీ కంటి చికిత్స

గూడూరు రోటరీ క్లబ్ సవేరా ట్రస్ట్, సిపిసి మైనింగ్ కంపెనీలు సంయుక్తంగా 4 నుంచి 11 తేది వరకు డిఎస్‌ఆర్ కమ్యూనిటీ హాలులో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం నిర్వహిస్తున్నారు. కర్నూలుకు చెందిన ప్రసిద్ధ వైద్యులు డాక్టరు కె. బాలకృష్ణ మూర్తి అవసరమైన రోగులకు ఆపరేషన్ చేస్తారు. పలువురు ఇతర

8వ పేజీలో



ఎసిటిఒ ఎస్. చెన్నయ్య కుమారుడు కిషోర్‌బాబు, శైలజ వీరి వివాహం 1 తేదీ నెల్లూరులో జరిగింది!

# పెండ్లిండ్లు

స్వయంకృషితో వృద్ధిలోకి వచ్చి జిల్లాలో ఎన్నదగిన వాడిగా గుర్తింపు పొందిన సంపన్నుడు, ధనార్జనలో కలిసి వచ్చిన అదృష్టం రాజకీయాలలో కన్నెర్ర చేసినా ఉత్సాహం కోల్పోని నాయుడుపేట మాజీ మండలాధ్యక్షుడు, తెలుగుదేశం ప్రభంజనంలో జిల్లా దక్షిణాదిలో ఎన్నికల్లో ఎదురొడ్డి నిల్చి గెల్చిన ఒకే ఒక కాంగ్రెస్ వాది, పార్టీలో పెద్ద పెద్ద లెందరితోనో స్నేహం వున్నా పదవు లేవీ పొందలేని నిర్భాగ్య శీలి, నాయుడుపేట, తిరుపతులలో చెరొక పాదం మోపి, రెండు జిల్లాలలోనూ అనుచర వర్గం సంపాదించు కోగల్గిన చతురుడు, ఎంత నిరాదరణ, ఆశాభంగాలు అవమానాలు ఎదురైనా కాంగ్రెస్‌ను వీడని గ్రుడ్డి భక్తుడు, స్నేహశీలి, భవిష్యత్‌లో చిరంజీవి ప్రజారథానికి సారథి కానున్న శ్రీ చదలవాడ కృష్ణమూర్తి కుమార్తె సుమలత, గోదావరి జిల్లా కొవ్వూరు వాసి శ్రీ జిఎస్. రావు కుమారుడు, శ్రీనివాస నాయుడుల కళ్యాణ మహోత్సవం ఆగస్టు 13 తేది తిరుపతిలోని శ్రీనివాస కళ్యాణ మండపం కాంప్లెక్స్‌లో వైభవోపేతంగా జరిగింది. అది నిజంగా కళ్యాణ మహోత్సవమే. నాయుడుపేట చుట్టూ ప్రక్కల పల్లె పల్లె నుంచి జనం దొరికిన బండల్లా పట్టుకొని తరలి వచ్చారు. అంత విశాలమైన ప్రాంగణంలో ఇసకేస్తే రాలలేదు. ద్రవ్యం ద్రవంలో ప్రవహించింది. మంచి నీళ్ల బదులు మినరల్ వాటర్ బాటిల్స్ లారీలలో దిగాయంటే, ఐస్‌క్రీమ్‌లు ట్రక్కులలో వచ్చాయంటే ఖర్చెంతో వూహించుకోవచ్చు. అన్ని వేల మందికి అతిథి మర్యాదలు చేయలేక నిర్వాహకులు చేతులెత్తేశారు. సినిమా, రాజకీయ రంగాలలోని ప్రముఖులందరూ ప్రెజెంట్ వేసుకొన్నారు కోట్ల, శివశంకర్ వంటి అగ్రనాయకులే కాక, చిరంజీవి, మోహన్‌బాబు వంటి స్టార్ అట్రాక్షన్ కూడా వుండింది.

* * *

విద్యుత్ బోర్డు మాజీ అధ్యక్షుడు, నెల్లూరులో ఎస్‌ఇగా పనిచేసి జిల్లా అంతటా స్నేహ సౌహార్ద్రాలు సంపాదించుకున్న కర్నూలీయుడు, స్వర్గీయ వివిరెడ్డి ఏకైక కుమార్తె ఇంద్రాణి, హైదరాబాదు శ్రీ డి. రాజాలు రెడ్డి కుమారుడు నాగరాజా రమణారెడ్డి పరిణయం ఆగస్టు 12 తేది హైదరాబాదు

6వ పేజీలో

జమీన్‌రైతు
సంవత్సర చందా రు. 100/-
6 నెలలకు - రు. 50/-



## కడప జిల్లా 1వ ఆదనపు జడ్జికోర్టులో

M.V.O.P No-49/93

కె. వెంకటేశ్వర రెడ్డి
S/o వెంకటసుబ్బారెడ్డి
సాకిన్: కటేరి నాయని పల్లి, మర్రిపాడు మండలం నెల్లూరు జిల్లా పిటీషనరు

Vs

1. L.రఘురామయ్య జీపు ఓనర్, దేవళం దగ్గర, వినుకోలు, చిత్తూరు జిల్లా రెస్పాండెంటు

పై నంబరులోని పిటిషనరుకు యాక్సిడెంటులో జరిగిన గాయములకు నష్టపరిహారం కోరి Section 140 MV Act క్రింద పై పిటీషన్ దాఖలు చేసినారు. మీకు ఏమైనా ఆక్షేపణలున్న ఎడల 28-9-93వ తేది ఉదయం 10-30 గంటలకు హాజరై తెలుపు కోవలెను. లేని ఎడల ఎక్సుపార్టీగా తీర్మానించ బడును.

శ్రీమతి. జె. సులోచన,
తేది: 28-8-93 అడ్వొకేట్, కడప.

## బాపట్ల డి.ము కోర్టులో

OP 4/93

పిటీషనర్లు
1. షేకు మున్వర్‌బి వురఫ్ బీబీజాన్
2. షేకు రఫీక్. 3. షేకు ఖమర్‌జాన్
2,3మై.నే. తల్లి. షేకు మున్వర్‌బి వురఫ్ బీబీజాన్ మరియు

రెస్పాండెంట్లు
1. షేకు యూసఫ్.
2. షేకు చిన యూసఫ్
3. షేకు ఇమాం, 4. షేకు నూర్జహాన్
5. షేకు గుల్జార్

బాపట్ల కాపురస్తుడు లేట్ షేకు ఇబ్రహీం PC No.853 గారికి గవర్నమెంటు వారు చెల్లించ వలసిన పెన్షన్ వగైరాలు తాలూకు రు.16,361-00 లు రాబట్టు కొనుటకు పిటీషనర్లు పేర సక్సెషన్ సర్టిఫికెట్ యిప్పించమని పిటీషనర్లు పై నెంబరున పిటీషన్ దాఖలు చేసినారు. యిందు విషయమై యెవరికైనా ఆక్షేపణలు వున్నచో 8-9-93 తేది ఉదయం 10-30 లకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు మనవి చేసుకోవలసినది. లేనిచో పరోక్షము నందు తీర్మానం చేయబడునని తెలియ చేయడమైనది.

షేకు జమ్రుద్ బాషా
పిటీషనర్ తరఫు అడ్వకేటు

# శివారెడ్డి పద్యాలు

### ఎమ్మెల్యే జె.కె. రెడ్డి

దానధర్మముల్లోదర్శలో ముందుంటాడు
పేదసాదలంటె ప్రీతిమెండు
నీతి నిష్టలకు నిలయమ్ము యమ్మెల్యే
జె.కె. రెడ్డి ఆయన పోకడేరు

### జిల్లా కలెక్టరు

ఎంతో కాలమైంది ఏ తమ్ము దర్శించి
కవిని నేను తమ్ము కలుసుకొని
చెప్పుగాదె సాంబశివరావు నిను గూర్చి
ఎవరు నీకు సాటి యీవు మేటి

### కవులు

కవుల కాదినాల్లో కనకాభిషేకాలు
పూరపూర గొప్ప పుత్సవాలు
ఇప్పుడీదినాల్లో చిప్ప చేతికి బొచ్చ
చెప్పుకుంటె రద్ది సిగ్గుబోద్ది!

### ఏడుకొండలోడు

కళ్లుపోరలు చూపు కనిపించడం లేదు
కలం మునుపుటాల కదలడంలా
ఏమి జేస్తె తిరుపతెంకన్న యీ శిక్ష
నాకు పురము కవికి నాకు లైదు

### బాపనోడి పెల్లి

తాకబోను నేను తాళింపు వంకాయ
ముట్టుకోను నేను ముద్దపప్పు
బాపనోడి పెల్లి బస్ ఛార్జి గిడుతుంద
పోను రాను లేని పోని శ్రమలు!

### కలము

చెప్పిన మాటినడంలా
అప్పడాలకలముముందు కడుగేయడంల
వొప్పొతప్పొ వ్రాశా
తప్పునాదిగాదుప్రతిదితమకుదెలుసుగా!

### సత్యానంద మహర్షి (ఇనమడుగు)

పాయసమ్ము, వడలు ఫలహారములబెట్టి
కుర్చి పీట యిచ్చి కూర్చొపెట్టి
సత్కరించినావు స్వామి సత్యానంద!
యింత కంటె భాగ్యమేమి కవికి?

## జనవాణి

(3 పేజి కొరవ)

లభ్యమౌతున్నాయి. ప్రభుత్వం పారిశ్రామికులను ప్రోత్సహించి, పరిశ్రమల స్థాపనకు కృషి చేస్తె అక్కడి ప్రజల జీవన స్థితి గతులు మారుతాయి. వారిలోని నిరాశా నిస్పృహలు వైదొలుగుతాయి. హింసా ప్రవృత్తి మారి, జీవితం పట్ల అనురక్తి పెంచుకొని అందరి వలె వారూ సౌహార్ద్రాలతో జీవిస్తారు. సగటు రాయలసీమ పౌరుడి జీవితాన్ని మెరుగు పరచనిదే రక్త పంకిలమౌతున్న వారి జీవిత విధానం మారదు. ఆ దిశలో కృషి చేసే ప్రజా నాయకులు కావాలి, రావాలి!

—సి. రామసుబ్బారెడ్డి
ప్రొద్దుటూరు

### పినాకినీ తీరం కొనసాగించండి!

శ్రీరామమూర్తి గారి మరణంతో పినాకినీ తీరం మూగబోయింది. అందుకు చాలా బాధగా వుంది. కలం పేరుతోనో, మరో విధంగానో మరొకరి చేతనైనా ఆ శీర్షిక కొనసాగించమని నా కోరిక. శ్రీరామమూర్తి గారి స్మృతి చిహ్నంగా ఆ శీర్షిక జమీన్‌రైతులో ఎప్పటికీ కనబడుతూ వుండాలన్నదే నా ఉద్దేశ్యం.

20తేదిసంచికలో, అమెరికాలో రెండు వేల కోట్ల వ్యాపారం చేస్తున్న నెల్లూరీయుడి గురించి సణుగుడు శీర్షికలో వ్రాయడం మాకు ఆశ్చర్యం కల్గించింది. ఆ వార్తను ఇతరత్రా బాక్సు కట్టి వేసి వుండినా అభ్యంతరం లేదు కాని, సణుగుడు శీర్షికలో అది కన్పించడం బాధ కల్గించింది. జమీన్‌రైతులో బాంబుల శివారెడ్డి వార్త హెడల్. ఆ వార్తను చూసి నేను చిత్తరపోయాను. బాంబుల శివారెడ్డి గురించి విన్నానే గాని, మరీ ఇంత కర్కోటకుడా అన్పించింది. ఆ వార్తనంత నిర్భయంగా ప్రచురించినందుకు అభినందనలు.

—కంచర్ల సుబ్బానాయుడు
సంగం జర్నలిస్ట్

### అద్భుతం

బాంబుల శివారెడ్డి పై జమీన్‌రైతులో కథనం అద్భుతం. మరుభూమికి మారాజుగా పేర్కొన్న మీ శైలీ విన్యాసం దాదాపు ఇండియా టుడే స్థాయిని దాటిపోయింది. సంవత్సరాలు, అంకెలు ఇస్తూ కూడా పాఠకుణ్ణి తల తిప్పనీకుండా చదివించ గల్గడం మీ శైలీ సామర్థ్యానికి నిదర్శనం.

నెల్లూరు —సి. నారాయణ రావు

## జిల్లా వార్తలు

(7 పేజీ కొరవ)

డాక్టర్లు వస్తున్నారు. రోగులకు ఉచిత వసతి, భోజనం, కళ్లద్దాలు ఇస్తారు. నిరుపేద రోగులు ఈ అవకాశాన్ని వుపయోగ పెట్టుకోవాలని కోరుతున్నారు. రోటరీ కార్యదర్శి శ్రీ కె. ఆర్. రెడ్డి.

### పబ్లిక్ ఫోన్లు పెట్టకూడదా?

కావలి టౌన్‌లో లోకల్ కాల్స్ సదుపాయం కల్పించే పబ్లిక్ ఫోన్లు లేవు. ఎస్‌టిడి బూత్‌లు వున్నాయి కాని, వాటిలో లోకల్ కాల్స్ చేయడానికి వీలే చిక్కదు. ఎప్పుడూ రద్దీయే. వూరు పెద్దదై పోతున్నది. ఒక చోట నుంచి ఇంకొక చోటుకు వెళ్లాలంటే ఆలస్యం, శ్రమ. ఈ క్రింద చెప్పిన ప్రదేశాలలో పబ్లిక్ ఫోన్లు వుంటే సౌకర్యమని ఒక పౌర ముఖ్యుడు వ్రాస్తున్నారు. ఆర్‌డిఒ ఆఫీసు, స్టేట్ బ్యాంకు, తాలూకాఫీసు, ఆర్‌టిసి బస్టాండు, ఎడిఎం ఆస్పత్రి, అన్నపూర్ణ ... కాంప్లెక్స్, అరుణోదయ కాంప్లెక్సు, ప్రభుత్వాసుపత్రి, పోస్టాఫీసు, జవహర్ భారతి, రైల్వే స్టేషన్, మునిసిపల్ఆఫీసు!

డిఇటి గారు పరిశీలిస్తారా!

### చెన్నూరులో గర్భ కోశ వ్యాధుల శిబిరం

చెన్నూరు మిత్ర మండలి, నెల్లూరు లయన్స్ క్లబ్‌లు కలసి 29 తేది చెన్నూరులో స్త్రీలకు ప్రత్యేకించి గర్భకోశ వ్యాధుల చికిత్స శిబిరం నిర్వహించింది. లయన్స్ క్లబ్ అధ్యక్షుడు శ్రీ ఎస్.ఎస్.వి. రామమోహన రావు ప్రారంభించారు. డాక్టర్ జె. జయచంద్ర కార్యక్రమం పర్యవేక్షించారు. డాక్టర్లు – శ్రీమతి జి. కౌసల్యమ్మ, జి. అహల్య, ఉషారాణి, సి. ఇందిర, ఎం. సుజాత, జి. ప్రభావతి, డి. విజయలక్ష్మి, ఎన్.వి. సులోచన, డి. రమాదేవి, పి. వెంకటేశ్వర్లు వైద్య పరీక్షలు నిర్వహించారు. ఏడు వందల పై చిలుకు రోగులను పరీక్షించడం జరిగింది.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

నారుల కిప్పుడు గొన్న వేసి కొనును కలికి నేడు జుట్టు కత్తిరించు బొట్టును తుడుపును దేశ సంస్కృతికిని తెచ్చె ముప్పు?

అని పూరించి శెహబాష్ మనిపించారు అవధానిని శ్రీమతి ఎం.కె. ప్రభావతి. కుమారి ఎం. గిరిజ అప్రస్తుత ప్రసంగం ప్రేక్షకుల పై టానిక్‌లా పని చేసింది. 'అబ్బాయిలు తమను తాము అమ్ముకొంటూ, మళ్లీ అమ్మాయిల చూసి నవ్వుకొంటా రెందుకు' అనే కొంటె ప్రశ్నకు అయితేనేం కొనుక్కొన్న మగాడిని అతివలు ఇంట్లో పిల్లిని చేస్తున్నారు కదా అని అవధానిని చమత్కరించారు. కురువాడ లలితమ్మ నామావళి పాత వాసనలు. కుమారి సి. ఆదిలక్ష్మి పురాణ పద్య పఠన ప్రతిభ కొద్దిగా కొరవడి నట్లుండినాయి. చక్కని కార్యక్రమాన్ని సింహపురీయులకు అందించిన వర్థమాన సమాజం కార్యదర్శిని శ్రీమతి ప్రభావతి సింహ విక్రపురి నరసింహ దతదు అని ప్రశంసించారు కాబట్టి మేమేమి రాయటం లేదు. అప్పుడప్పుడు ఇట్లా ఆడవాళ్లను వేదికనెక్కించే కార్యక్రమం సమాజం చేబడితే మస్తుగా జనం వస్తారేమో ప్రయత్నించి చూడండి!

### నెల్లూరులో అంతర్ కళాశాలల క్రీడల పోటీలు

క్రీడాభిమానియైన ఆనం వివేకానంద రెడ్డి ఎప్పుడు ఏదో ఒక క్రీడోత్సవం నిర్వహిస్తుండదం పరిపాటే. తాను వి.ఆర్. కళాశాల కరస్పాండెంట్ అయ్యాక ఎస్.వి. యూనివర్సిటీ పరిధిలో అంతర్ కళాశాలల క్రీడా పోటీలు నిర్వహించాలన్న కోరిక మదిలో మెదలడమే తడువుగా వాటిని సెప్టెంబర్ 11 తేది ప్రారంభ మవుతాయని ప్రకటించారు. ఎంట్రీలు పోస్టులో పంపడం అవి ఇబ్బందుల పోటీలయ్యాక చేరడం వంటి ఇబ్బందుల దృష్టిలో వుంచుకొని కాలేజీలు కళాశాలన్నీ ఎంట్రీలు లేకుండా తమ జట్లతో నేరుగా 10 తేది సాయంత్రం కళాశాల గ్రౌండ్‌లో వుండే ఆర్గనైజింగ్ సెక్రటరీ జి. దయాకర రెడ్డిని కలవచ్చుని చెబుతున్నారు. 110 మీటర్ల హర్డిల్స్, హ్యామర్‌తో కొత్త క్రీడా పోటీలను తొలుత ప్రవేశ పెడుతున్నట్లు చెప్పారాయన.

## పి.వి.

(చివరి కొరవ)

లెక్కకు ఆరుగురు మంత్రులు క్యాబినెట్‌లో వున్నా వారిలో ఏ ఒక్కరు కూడా తనకు రాజకీయంగా ఉపయోగ పడటం లేదని పి.వి. భావిస్తున్నారట. అందుకే ఆంధ్ర ప్రదేశ్ నుంచి తనకు సన్నిహితంగా ఉన్న మాజీ ముఖ్యమంత్రికి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి దగ్గరకు తీయాలని పి.వి. తీవ్రంగా ఆలోచిస్తున్నారట. రాజకీయాల్లో ఢక్కాముక్కీలు తిని వున్న జనార్ధన రెడ్డి వల్ల కేవలం ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే గాక ఢిల్లీలో కూడా తనకు రాజకీయ తోడుగా వుపకరించ గలడని పి.వి. భావిస్తున్నారట. జనార్ధన రెడ్డికి కేంద్ర మంత్రివర్గంలో చేర్చుకోవాలా? లేక పార్టీ పదవి ఇవ్వాలా? అన్న విషయమై పి.వి. తర్జన భర్జన పడుతున్నారట. జనార్ధన రెడ్డి రాజకీయంగా పి.వి.కి సన్నిహితుడు కావటంతో పాటు వై.ఎస్. రాజశేఖర రెడ్డికి ప్రత్యర్థి కావటం, రాష్ట్రంలో తగినంత మద్దతు కూడగట్టడంలో కోట్లకు ధీటుగా వ్యవహరించే సత్తా కలిగి వుండడం జనార్ధన రెడ్డికి ప్లస్ పాయింట్లని చెబుతున్నారు.

అయితే జనార్ధన రెడ్డి మాత్రం ముఖ్యమంత్రి కోట్లతో స్నేహంగా వ్యవహరిస్తున్నారు. వై.ఎస్. రాజశేఖర రెడ్డికి ముఖ్యమంత్రి అనవసర ప్రాధాన్యం ఇవ్వటం పట్ల జనార్ధన రెడ్డి కొంత అసంతృప్తితో వున్నా రాష్ట్ర ప్రభుత్వాన్ని ముఖ్యమంత్రి పరిపాలనను ఆయన సమర్థిస్తున్నారు. రాష్ట్రంలో కరువు సహాయక పనుల కోసం కేంద్రం నుంచి అత్యధిక నిధులు రాబట్టడంలో గత ముఖ్యమంత్రుల కంటే కోట్ల వారే . ఎక్కువగా సఫలీకృతుల య్యారని జనార్ధన రెడ్డి కితాబు ఇవ్వటం గమనార్హం. అయితే భవిష్యత్తు రాజకీయ పరిణామాలు రాష్ట్ర రాజకీయాల పై ఎలా ప్రభావం చూపుతాయన్నది ఆసక్తికరమైన విషయం. కాగా త్వరలో కేంద్ర రాష్ట్ర మంత్రి వర్గాల పునర్వ్యవస్థీ కరణలో ఆయా నాయకులకిచ్చే ప్రాధాన్యం వల్ల అనేక మార్పులు చోటు చేసుకునే అవకాశం లేకపోలేదు. రాష్ట్రంలో పి.వి. అనుకూల వ్యతిరేక వర్గాల ఏర్పాటుకు అంకురార్పణ జరిగిన నేపథ్యంలో మంత్రి వర్గ విస్తరణ తర్వాత రాష్ట్ర రాజకీయ వాతావరణం వేడెక్క గలదని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు.

## ముస్లిం యువకుడితో నటి ఐశ్వర్య పెండ్లి

* నా సమ్మతితోనే నా వివాహం జరిగింది!
ఐశ్వర్య

* నా దృష్టిలో అదెప్పుడో గతించిన దాని క్రింద లెక్క!
అమ్మ

* మత్తు మందులకు బానిస చేసి నా మనుమరాలిని మోసం చేశారు
అమ్మమ్మ

ఐదు నెలల క్రితం తన అమ్మమ్మతో కలిసి బయటు వెళ్ళిన నటి ఐశ్వర్య కొంత కాలం క్రితం ఒక వర్ధమాన పరిశ్రమ యజమాని పుత్రుడు తన్వీర్ హాస్సేన్‌తో తరచు కన్పించేది; "మీరిద్దరు పెళ్ళి చేసుకో బోతున్నారా? అని ఎవరైనా అడిగితే, నాకు పెళ్ళంటూ జరిగితే మీకు శుభలేఖలు తప్పకుండా అందజేస్తాను. ఆ యువకుడు నాకు ఫ్రెండ్ మాత్రమే. అని ఐశ్వర్య అంటూండేది. ఇటీవల ఓ రోజు ఆమె ఓ తమిళచిత్రం షూటింగ్‌కు హాజరవలేదు. హఠాత్తుగా ఆస్పత్రిలో చేర్పబడిందని పుకారు పొక్కింది. మర్నాడు ఆమె పాత్రికేయులను సమావేశ పరచి," తన్వీర్ హాసేన్‌ను పెళ్ళి చేసుకోవడం కోసం నేను ఆగస్టు 18 వ ఇస్లాం మతం స్వీకరించాను. నా పేరును అపిహాన్‌గా మార్చుకున్నాను. అతను సహృదయుడు. అతనితో నాకు మూడేళ్ళకు పైగా పరిచయం ఉంది. మా వివాహానికి అతని తల్లిదండ్రులతో పాటు మా అమ్మ, అమ్మమ్మ అభ్యంతరం చెప్పారు. అందుకే బి.టి.కె. రోడ్‌లోని మసీదులో తమిళనాడు కాజీ సమక్షంలో పెళ్ళి చేసుకున్నాం. రిసెప్షన్‌ను భారీ ఎత్తులో జరిపించాలను కుంటున్నాం. ఇక నేను కొత్త సినిమాలు ఒప్పుకోను. మా ఆయన చికాం పెట్టభద్రుడు; ముగ్గురు తమ్ముళ్ళు, లైలా అనే చెల్లెలు ఉన్నారు. తండ్రి పసులూర్ రెహమాన్ వ్యాపారస్థుడు." అంది ఐశ్వర్య.

* * *

ఈ విషయాన్ని ఆమె తల్లి లక్ష్మి ఎదుట ప్రస్తావిస్తే, "అదెప్పుడు నా ఇంటినుంచి వెళ్ళిపోయిందో -ఆ నాటి నుంచి దానికీ నాకూ సంబంధం లేనట్లు తలస్నానం చేసేశాను కూడా. ఇక నేనేమిటో, నా వృత్తేమిటో, ప్రజాసేవ ఏమిటో తప్ప ఐశ్వర్య గురించి ఆలోచించాల్సిన పని లేదు. కొత్తగా రాజకీయ రంగంలో ప్రవేశించాను గనుక ఇక భారతదేశమే నాకు మాత. ప్రజలే తోబుట్టువులు వాళ్ళ శ్రేయస్సు కోసంపాటు పడడమే నా ధ్యేయం." అంది.

* * *

"నా మనవరాలికి మత్తు పదార్థాలు అలవాటు చేసి వశం చేసుకుని, ఆమెను కిడ్నాప్ చేసిన తన్వీర్ హాసేన్‌పై తగు చర్య తీసుకోవాలి." అంటూ అమ్మమ్మ కె.టి. రుక్మిణి పోలీసులకు ఫిర్యాదు చేసింది. "ఆ యువకునితో పరిచయమైన దాదిగా అమాయకురాలైన నా మనమరాలు మారిపోయింది. రక్షణగా ఉన్న నన్ను ఖాతరు చేయడం మానేసింది. నేను ఇంట్లో లేనప్పుడు వాళ్ళిద్దరూ కలిసి మద్యం సేవించేవారు. ఇంకా హెరాయిన్, బ్రౌన్ షుగర్ వంటి మాదక ద్రవ్యాలకు కూడా ఐశ్వర్య బానిస అయింది. ఒక్కోరోజు రాత్రి అతనితో ఎక్కడికో వెళ్ళి పోయేది. ఒక ఫైవ్‌స్టార్ హోటల్లో ఆమెకతను ఎందరో యువకులను పరిచయం చేసేవాడట. ఆమె ఎంతో డబ్బు తగలేసేది. ఆ దుర్మార్గుడ్ని జైలు చేసి, అతని బారినుంచి నా మనమరాలిని కాపాడవలసిందని మనవి." అని ఐశ్వర్య అమ్మమ్మ పోలీసు కమీషనర్‌కు ఫిర్యాదు చేసింది.

అది తెలిసి ఐశ్వర్య వెంటనే కమీషనర్‌కు 'నోటరీ పబ్లిక్ వకీల్' ద్వారా లేఖ పంపుతూ," నా వయస్సు 22;నేను మేజర్ని. నా జీవిత భాగస్వామిని ఎన్నుకున్నాను. నన్నెవరూ కిడ్నాప్ చేయలేదు. మా వైవాహిక జీవితం సాఫీగా సాగడానికి కొంత కాలంపాటు నాకు పోలీసు రక్షణ కావాలి." అని విన్నవించుకుంది.

ఐశ్వర్య విన్నపం సమంజసం గానే ఉందని పించింది పోలీసు వారికి. కాని, తన్వీర్ హాసే హాసేన్‌కు ఇంతకు ముందు సందీప్, లలిత్, రేష్మా, శబ్నా వగైరా ఎందరో ప్రియురాళ్ళు ఉండేవారని, అతను సదా మత్తులో ఉంటాడని రూఢిగా తెలిసినందు వల్ల అతన్ని ఒక కంట గమనించాల్సిన అవసరం ఉందని డి.ఎస్.పి. జంబుకుమార్ దర్యాప్తు సాగిస్తున్నాడింకా!

## తారలకు బ్రోకర్లుగా సినీ పాత్రికేయులు!

"ఇది వరకు పాఠక లోకానికి సినిమా రంగానికి మధ్య వారధిగా ఉండే వారు సినిమా పాత్రికేయులు. ఇప్పుడు నిర్మాతలకు కొందరు తారలకు మధ్య వారధిగా తయారయ్యారు!" అని ఇటీవల ఒక నిర్మాత వేసిన జోక్‌కు అక్కడున్న వది మంది నవ్వారు. ఇందులో అతిశయమేమీ లేదు. గతంలో సావిత్రి, భానుమతి, జమున వంటి నటీమణులను నిర్మాతలు స్వయంగా కలుసుకొని బుక్ చేసేవారు. ఇప్పుడు సినిమా పాత్రికేయులు కొందరు తారలకు బ్రోకర్లుగా తయారయ్యారు. వీళ్లను అడ్డం పెట్టుకొని కొందరు ప్రతిభ లేని తారలు సినిమా ఛాన్సులు సంపాదిస్తున్నారు. నిర్మాతల అవసరాన్ని బట్టి ఈ పాత్రికేయులే ఆయా తారల రేట్లను పెంచేస్తున్నారు. వాళ్ల రేట్లు పెరిగితే వీళ్ల కొచ్చే కమీషన్ కూడా పెరుగుతుంది గనుక. ఇలా సినిమా రంగానికి పరోక్షంగా కీడు చేస్తున్న ఒక బ్రోకర్ పాత్రికేయుడు ఇటీవల ఒక నిర్మాత ఆగ్రహానికి గురి అయ్యాడు. తాము నెల జీతాలు తీసుకునే పత్రికా సంస్థకు కళంకం తెచ్చే రీతిలో వ్యవహరిస్తున్నామని ధ్యాస ఈ పాత్రికేయులకు లేదు. ఇలాంటి వారిని ప్రోత్సహించ కూడదనే అభిప్రాయం నిర్మాతలకు త్వరలో కల్గక మానదు. పైగా, ఆయా తారలు పైకి వచ్చాక ఈ పాత్రికేయుల అవసరం తీరి, వీరిని కుక్కల్లా చూడడమూ కద్దు. పవిత్రమైన పాత్రికేయ వృత్తికి మచ్చ తెచ్చే ఇలాంటి నక్షిప రాయుళ్ళు సినిమా రంగానికి ఓ విధంగా చీడ పురుగులే – అని ఇటీవల ఒక ప్రముఖ నిర్మాత అన్నారు. ఆయన్ని ఈ మధ్య ఒక బ్రోకర్ పాత్రికేయుడు కలుసుకుని "ఫలానా తార కాల్‌షీట్లు నేను చూస్తున్నానండీ. మీ చిత్రంలో హీరోయిన్‌గా ఆమెను పది లక్షలకే ఒప్పుకునేలా చేస్తాను" అన్నాడట. నేను సినిమాలు తీయడమైనా మానేస్తా గాని, ఇలాంటి వారిని బుక్ చేయను. అయినా, నువ్వేం జర్నలిస్టువయ్యా. నిక్షేపంగా నీ వృత్తేమిటో చూసుకోక ఈ బ్రోకర్ బ్రతుకేమిటి?" అని నలుగురి ముందూ మందలించాడట.

### సెప్టెంబర్‌లో చాలా చిత్రాలు

బాలకృష్ణ, విజయశాంతి నటించిన "నిప్పురవ్వ", నాగార్జున "అల్లరి అల్లుడు", డబ్బింగ్ చిత్రాలు "అసాధ్యుడు", "ఉగ్రవాది", "పాండవులు" వంటి చిత్రాలు సెప్టెంబర్‌లో విడుదల కానున్నాయి.



## ఆడవారి ఔన్నత్యం ధ్యేయంగా తయారైన మంచి చిత్రం – దామిని!

చిత్రసమీక్ష
అల్లూరు రహీం

తాను నమ్మిన నీతి కోసం చివరి క్షణం వరకు పోరాడి గెల్చిన ధీరోదాత్త యువతి కథే 'దామిని' హిందీ చిత్రం. ఈ యేటి జాతీయ అవార్డులు అందుకొన్న జాబితాలో గల ఈ చిత్రంలో అత్యాచారానికి గురైన మహిళలను చట్ట, న్యాయ వ్యవస్థలు రక్షించక పోగా, కోర్టులలో విచారణ పేరుతో వారి హక్కులు భంగమయ్యే రీతిలో ప్రశ్నిస్తూ వివక్షత పాటిస్తున్న వైఖరిని దుయ్యబట్టారు. న్యాయ స్థానాల్లో సాక్ష్యం చెప్పను వచ్చిన వ్యక్తికి రక్షణ కల్పించలేని ప్రభుత్వ అసహాయతను నిలదీశారు. కళ్ల ముందు జరిగే అన్యాయాలను ఎదిరించి ప్రజలు ముందుకు రావాలని పుద్బోధించారు. ఎంచుకొన్న కథ, దాన్ని స్పష్టంగా చిత్రీకరించిన తీరు, భారీ తారాగణం, ఆలోచింప జేసే మాటలు, వీనుల విందైన పాటలతో అడుగడుగునా కన్పించే దర్శక ప్రతిభకు అద్దం పట్టిన చిత్రమే దామిని.

దామిని (మీనాక్షి శేషాద్రి) స్వతంత్ర వ్యక్తిత్వం గల యువతి. అందువల్లే ఆమెను కోరి వరించను వచ్చిన కోటీశ్వరుడు శేఖర్ గుప్తా (రిషి కపూర్); అతని తండ్రి గుప్తాజీ (కుల్‌భూషణ్ కర్బందా) లతో పెళ్లి చూపుల సమయంలోనే తన అక్క ప్రేమించి పక్క ఇంటి వానితో లేచి పోయిన సంగతి, వారు టీ తాగుతున్న కప్పులు అరువు తెచ్చిన సంగతి బట్ట బయలు చేస్తుంది. ఈ వ్యక్తిత్వం మామ గుప్తాజీకి నచ్చి తన కోడలిగా చేసుకున్నా అత్త సుమిత్ర (రోహిణీ హట్టంగడి) పేదింటి పిల్లని ఆమెను చిన్న చూపు చూస్తుంది. దామినిని శేఖర్ పెళ్లి చేసుకోవడంతో తన కూతుర్ని అతనికిచ్చి చేద్దామని భావిస్తుండిన బజాజ్ (పరేష్ రావెల్) రగిలి పోయి వ్యాపార పరంగా గుప్తా కుటుంబాన్ని దెబ్బ తీసినా వాళ్లు పట్టించుకోరు.

హోలీ పండుగ జరుగుతున్న సమయంలో దామిని మరిది (శేఖర్) తమ ఇంట్లోని పనిపిల్ల పూర్మిని తన స్నేహితులతో కలసి బలాత్కారం చేయడం చూసి ఆవేదనతో రగిలి పోతుంది. ఇంటి పరువు ఎక్కడ గంగలో కలసి పోతుందోనని గుప్త కుటుంబం మొత్తం దామిని నోరు మూయించాలని చూస్తారు. కాని విషయాన్ని కళ్లారా చూసిన దామిని ఆత్మవంచన చేసుకోలేక పోలీసులకు విషయం చెప్పడం, అత్యాచారానికి పాల్పడిన వారిని అరెస్ట్ చేయడం, నిజం పలికినందుకు అత్త వారింట నుండి వెలుపలికి రావడం జరిగి పోతాయి. పోలీసులను కొని వేయడంతోపాటు, నందిని వందిని చేయగల లాయర్ జడ్డా (అమ్రీష్‌పురి) వాదనలతో దామినికి మతి భ్రమణ జరిగిందని నిరూపించి ఆస్పత్రిలో చేర్పించి కేసును పక్కదారి పట్టించడం జరుగుతుంది. తనను చంపి సాక్ష్యాన్ని పూడ్చి పెట్టాలని ప్రయత్నించిన సమయంలో అక్కడ నుండి తప్పించుకొని లాయర్ రావెల్ (సన్నిడియోల్) ను ఆశ్రయించి అతని సహాయంతో మళ్లీ కేసు రీ ఓపెన్ చేయించి, అష్ట కష్టాలు పడి నేరస్తులకు శిక్ష వేయించి, తాను నమ్మిన నీతిని గెల్పిస్తుంది.

అత్యాచారానికి గురైన మహిళలను కోర్టులలో ప్రశ్నల రూపంలో క్రుంగదీసే విధానానికి స్వస్తి చెప్పాలనే తీరును దర్శకుడు చక్కగా చెప్పగలిగాడు. అన్యాయానికి గురైన వారిని పత్రికలు, పోలీసులు, కోర్టులు మరింత బాధ పెడుతున్న వైనాన్ని కళ్లకు కట్టినట్లు చూపించ గలిగాడు. ఆడ పిల్లలకు స్వతంత్ర వ్యక్తిత్వం వుండకూడదన్న విషయం మీద చక్కని చర్చ పెట్టారు. ఈ సీన్లన్నీ హైలెట్‌గా వచ్చేందుకు హీరోయిన్ మీనాక్షి శేషాద్రి పడిన శ్రమ ప్రశంసనీయం. భర్త నీవెలా వున్నావని అడిగినప్పుడు పంజరంలోని పక్షులను చూపించడం, పని మనిషి పడి వున్న హాస్పటల్ బెడ్ రక్తంతో తడిచి వుండడం చూసి చలించి పోవడం, భర్తను న్యాయా న్యాయ విషయాల పై నిలదీసే సన్నివేశాల్లో ఆమె నటన పరాకాష్టకు చేరింది. అందులోనిదే నాట్యబేలా; స్త్రీ ఎద శృంగార రస స్పందనకే కాదు బిడ్డకు ప్రాణం పోసేందుకూ పనిచేస్తుందని; వాయిదాలతో కేసులు నీరు గారి న్యాయవ్యవస్థ నీరు గారి పోయిందన్న దిలీప్ బక్షీ మాటలు తూటాలే. వాస్తవానికి దగ్గరగా రాసిన సుతాను గుప్త కథకు చక్కని సంగీత మందించాడు నదీమ్ శ్రావణ్. జబ్‌సే తుమ్ కో దేఖా హై, గావా హై చాంద్ తారే వంటి మెలోడి పాటలు అందించాడు రచయిత సమీర్.

జాతీయ ఉత్తమ నటి అవార్డును వెంట్రుక వాసిలో మీనాక్షి శేషాద్రి కోల్పోయినా ప్రతి సీన్‌లోనూ చక్కని నటన ప్రదర్శించింది.

ఒకే ఒక సన్నివేశం పై చక్కని కథనల్లి స్క్రీన్‌ప్లే కూర్చి ఎక్కడా విసుగని పించకుండా చక్కని కథ నడిపి యువతుల్లో ఆత్మస్థైర్యం పెంచే చిత్రాన్ని తీసిన యువ దర్శకుడు రాజ్‌కుమార్ సంతోషి ప్రశంసనీయుడు.

# అధికార లాంఛనాలు తప్ప ఆకర్షణే లేదు!

## కోట్ల గైర్ హాజరుతో జనార్దన రెడ్డి 'షో' దిగ్విజయంగా నడిచింది!

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు 31 తేది శ్రీహరికోట రాకెట్ కేంద్రంలో రెండు గంటలు గడిపి వెళ్లారు. ప్రధాని అయిన తర్వాత శ్రీ పి.వి. నెల్లూరుకు రావడం ఇదే ప్రథమం. కాని అది శ్రీహరి కోటకే పరిమితం కావడంతో జిల్లాకు వచ్చినట్లే అన్పించడం లేదు. శ్రీహరికోట నెల్లూరులో భాగమనే కాని, ప్రపంచంతోనే సంబంధం లేని ద్వీపం వంటిదది. పాత కాలంలో రాజులు కట్టుకొనే దుర్భేద్యమైన కోటను తలపింప జేస్తుంది. మామూలుగానే అక్కడ నరటు పొరుడికి ప్రవేశం లేదు; ఇక ప్రధాని వంటి వివిఐపిలు వచ్చినప్పుడు చీమనైనా దూరనిస్తారా? అంతా కలిసి తెభైఐదు మంది లోపుకు ప్రవేశార్హత లభించింది. అదీ నిర్ణీత ప్రదేశాలకే పరిమితం. హెలికాప్టర్ దగ్గర ప్రధానిని చూపించి, ఆడిటోరియంలో కూలేశారు.

గాసమొహిద్దీన్, జె.కె. రెడ్డి, సి.వి. శేషారెడ్డి, విష్ణువర్ధన్ రెడ్డి, ఆనం వివేకానంద రెడ్డి, ఆనం సంజీవ రెడ్డి తదితరులను పలుకరించారు పి.వి. తులసీదాస్ గారు సాష్టాంగ దండ ప్రణామం చేశారు. పాదాభి వందనాల పాడు సంస్కృతి తెలుగుదేశం నుంచి కాంగ్రెస్‌కూ అంటు వ్యాధిలా అంటుకున్నట్లుంది. కాళ్లు పట్టి అయినా పదవులు నిలుపు కోవాలనే నీచ మనస్తత్వం కల్గిన నాయకులు న్నందుకు మనం సిగ్గుతో తలదించు కోవలసిందే – వారికదేమిటో తెలియదు.

అక్కడ నుంచి పివి షార్ కేంద్రమంతా తిరిగి చూచారు. ప్రతి విభాగాన్నీ పరిశీలించారు. వివరాలడిగి తెలుసుకున్నారు. పై వారంలోనే అంతరిక్షంలోకి దూసుక వెళ్లనున్న పిఎస్ఎల్‌వి రాకెట్‌ను సందర్శించారు. 150 అడుగుల ఎత్తు వున్న ఈ

ఉదయం 9 గంటలకు మద్రాసు నుంచి హెలికాప్టర్‌లో దిగారు శ్రీ పి.వి. నరసింహా రావు గారు. తెల్లటి ధోవతి లాల్చీలతో పదహారణాల తెలుగు బిడ్డ గెటప్‌లో వుండినారు. ఆయన తోటి ఆయన పదవికి ఎసరు పెడ్తున్న కేంద్ర మంత్రి శ్రీ అర్జున్ సింగ్, ఇస్రో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి వచ్చారు. ఢిల్లీలో వంటరిగా వదలి పెడితే వారినీ వీరినీ కలిసి తన కుర్చీ క్రిందకు నీళ్లు తెచ్చేస్తాడేమోనని భయపడ్తున్నారు పి.వి. – అర్జున్‌సింగ్‌ను వదలి పెట్టకుండా తిరిగారు. "పీత కష్టాలు, పీతవి" కదా మరి!

హెలిపాడ్ దగ్గర ఇస్రో ఛైర్మన్ ప్రొఫెసర్ యు.ఆర్. రావు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి, పిసిసి అధ్యక్షుడు శ్రీ మల్లి తులసీదాస్ ప్రధానికి స్వాగతం చెప్పారు. నెల్లూరు నాయకులు శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి, చింతామోహన్, పద్మశ్రీ.

రాకెట్ వద్దకు మాత్రం పివి. అర్జున్ సింగ్‌లను తప్ప మరెవ్వరినీ అనుమతించలేదు. దాని పై భాగానికి వెళ్లడానికి లిఫ్ట్ సౌకర్యం వుంది. రాకెట్ రూపకల్పన, ప్రయోగించే విధానం, ఉపగ్రహాల తీరు, షార్ కేంద్రంలో తయారైన వివిధ రాకెట్లు, ఉపగ్రహాల చిత్ర ప్రదర్శన తిలకించారు. ప్రొఫెసర్ యు.ఆర్. రావు గారు వారికి ప్రతిదీ విడమరచి చెప్పారు. అధునాతన కంప్యూటర్ల గురించి శాస్త్రజ్ఞులు సమాచార మందజేశారు.

తర్వాత కేంద్రంలోని షార్ ఉద్యోగులను ఉద్దేశించి ఒకసారి, శాస్త్రవేత్తలకు ఇంకొక సారి లఘు ప్రసంగాలు చేశారు. పివి అంతరిక్ష పరిశోధనా రంగంలో మన శాస్త్రవేత్తల అసాధారణ ప్రజ్ఞను ప్రశంసిస్తూ ప్రభుత్వం వారికి అన్ని విధాలా అండదండగా నిలుస్తుందని, ప్రోత్సాహ మిస్తుందని హామి ఇచ్చారు ప్రధాని.

కేవలం షార్ కేంద్రానికి పరిమితం కావడం వల్ల, అదీ శాస్త్రవేత్తలతో సంభాషణలే కావడం వల్ల ప్రధాని పర్యటనలో సాధారణంగా కన్పించే ఆకర్షణ లేదు. అధికార

### ప్రధాని తొలి నెల్లూరు పర్యటన

లాంఛనాలే కొట్టొచ్చినట్లు కన్పించాయి.

పిలవాలని పిలవడంతప్ప, ఇతర అతిథులను పట్టించుకున్న వారు లేరు. ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి అనారోగ్య కారణంగా గైర్ హాజరు కావడంతో మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి "షో" మొత్తం తనదన్పించారు. ఆయన్ను కాదనే వారు, మించి పోయే వారు మరెవ్వరూ లేరు. పివి కూడా ఆ రెండు గంటలూ విడిచి పెట్టకుండా ప్రక్కన పెట్టుకున్నారు.

ఎమ్మెల్యేలు మంత్రుల పరిస్థితి జాలి కల్గించేదే. వారిని హెలిపాడ్‌కు, ఆడిటోరియంకు పరిమితం చేశారు. అప్పటికీ ఒకరిద్దరు ఎమ్మెల్యేలు ఇదేమైనా పాకిస్తానా, ప్రజాస్వామ్యం హరించుక పోతున్నదిక్కడ, ప్రజా ప్రతినిధులకు విలువ లేదా అని రుసరుస లాడారు కాని, వారి గోడు విన్పించుకున్న వారు లేరు.

### విలేఖర్ల వీరత్వం

షార్ ప్రాజెక్ట్ సభలు, కార్యక్రమాలకు తమను పిలువకుండా, తమిళనాడు నుంచి ప్రెస్‌ను దిగుమతి నిరసనగా 31 తేది ప్రధాని పర్యటనకు వెళ్తున్న మంత్రులు, ముఖ్యులను నడిరోడ్డో నిలిపి, రాస్తారోకో చేశారు నెల్లూరు విలేఖరులు. సూళ్లూరుపేట నుంచి శ్రీహరి కోటకు వెళ్లె రోడ్డులో విలేఖర్లు తిష్టవేసి, అందరి కార్లు ఆపారు. జనార్దన రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి "మంచి మాటలు" చెప్పి చల్లగా తప్పించుకొని వెళ్లారు. వెనుక వచ్చిన మంత్రి పెంచలయ్యాదులు చిక్కుక పోయారు. అప్పటికి దివాకర రెడ్డి గారు రాయలసీమ రివాజు ప్రకారం "వాళ్లను లాగిపారేయండి" అని హుకుం జారి చేశారు, పోలీసులకు. వారు తొందర పడలేదు. చివరకు షార్ పెద్దలు సారీ చెప్పడానికి సిద్ధ పడడంతో అలజడి సద్దుమణి గింది. ప్రొఫెసర్ యు.ఆర్. రావు విలేఖర్లను లోపలికి పిలిపించి, క్షమాపణ చెప్పి, భవిష్యత్‌లో ప్రతి కార్యక్రమానికి పిలుపు వస్తుందని హామి ఇచ్చారు. ఈ గొడవ ప్రధాని దృష్టికి కూడా వెళ్లిందట.

### గోచిపాత మంత్రులు

**–యనాదిరెడ్డి ఉవాచ**

కావలి ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి గారికి చిరాకు కల్గితే పట్టడం చాలా కష్టం. అందులోనూ అందని మంత్రిత్వపు ఆశా ద్రాక్ష పళ్లు పులుపెక్కి పండిపోయి, కుళ్లిపోయి, రాలిపోయే స్థితిలో వున్నాయేమో; నిరీక్షణా ఉక్రోషంతో వున్నాడు. అంతటి వాడిని పట్టుకొని అక్కడకు పోకూడదు, ఇక్కడకు పోకూడదు అని నిర్బంధిస్తే చిరాకేయదూ, మరి! ఎదురుగా కన్పడిన జనార్దన రెడ్డిని నిలదీసి, ఏమిటయ్యా నువ్వు గోచిపాత మంత్రులను మా నెత్తిన స్వారీకి పంపావు అని కడిగేశాడు. మంత్రులు గోచి పాతలంటయ్యా అని జనార్దన రెడ్డి అడిగితే – "కాక ఎవరు వీరు? సెక్యూరిటీ వాళ్లకు భయపడి వీధుల్లో, చెట్టుక్రింద లట్టాలు కొట్టే వారు మంత్రులా, వీరి పుణ్యానా మాకు విలువ లేకుండా పోతూంది" అని కసురుకున్నాడు. పైకి కన్పించే ఆయనకోపమంతా షార్ ప్రాజెక్టులో ప్రధాని వెంట అన్ని చోట్లకూ తిరగ నివ్వలేదని; లోపల ఉడికించే ఉక్రోషం – సీనియర్ ఎమ్మెల్యేగా తప్ప జూనియర్ మంత్రి నన్పించు కోలేక పోవడం. అక్కడున్న మంత్రులు – పెంచలయ్య, సాంబశివ రాజు, దివాకర రెడ్డి ముఖం గంటు పెట్టుకొని చూస్తూ నిలబడి పోయారు. ప్రధాని పర్యటనలో ప్రేక్షకుడికి రంజైన కాలక్షేపం కల్గించింది యానాది రెడ్డి గారి విన్యాసం.

# ఢిల్లీ జ్యోతిష్కుడు ఆశ పెట్టేశాడు

ఆజానుబాహుడు ప్రధాని పీఠం పై కూర్చుంటాడని ఢిల్లీకి చెందిన రాజకీయ జ్యోతిష్కుడొకరు 'భవిష్యవాణిని' వెల్లడించాడట. జాతీయ పత్రికల్లో కూడా ఈ భవిష్యవాణి ప్రముఖంగా చోటు చేసుకోవటంతో కోట్ల వారి ఆశలు చిగురించాయి. ఢిల్లీ రాజకీయ పరిణామాలు కూడా కోట్ల వారికే అనుకూలంగా వున్నట్లు అసమ్మతి శిబిరం ప్రచారం చేస్తోంది. దక్షిణాదికి చెందిన ప్రధానిని తొలగించేందుకు దక్షిణాది నుంచే ముసలం ప్రారంభం కావాలని ఉత్తరాది వారు భావిస్తున్నారు.

ఇలా వుండగా లోక్‌సభ సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రధాన మంత్రికి వ్యతిరేకంగా ఏర్పాటైన అసమ్మతి విందుకు హాజరు కావటమే గాక, ఆ తర్వాత ప్రధాన మంత్రితో తాను తీవ్రంగా విభేదిస్తున్నట్లు ప్రకటించారు.

డాక్టర్ రాజశేఖర రెడ్డి పట్ల ప్రధానికి మొదట నుంచి సదభిప్రాయం లేదు. తన స్వంత ప్రయోజనం సమస్యలో పడితే విప్లవ శంఖం పూరించి ఆగం చేయడం తప్ప ఇతరులకు సహాయ పడడం వైఎస్ తత్వం కాదన్న అభిప్రాయం ఎందువల్లనో పివిలో వున్నట్లు చెప్తారు. కోట్ల ముఖ్యమంత్రిగా ఎంపికయ్యే సమయంలో ఆయన వ్యవహరించిన తీరును బట్టి పివి ఈ అంచనాకు వచ్చినట్లు చెప్తారు.

ఆ సమయంలో రాజశేఖర రెడ్డి ముఖ్యమంత్రిత్వం కోసం చాలా గట్టి ప్రయత్నమే చేశారు. కాని పివి దృష్టి వేరుగా వుండింది. రాజశేఖర రెడ్డి కొంచెం తీవ్రంగానే దాన్ని ప్రతిఘటించడానికి నిర్ణయించు కున్నారు. అయితే ఆయనకు వ్యక్తిగత మిత్రుడైన ఒక ప్రఖ్యాత న్యాయమూర్తి, రాజశేఖర రెడ్డిని కలిసి, ఒక

### పివితో కయ్యం

(మొదటి పేజీ కొరవ)

రాయలసీమ నాయకుడికి లభించే అవకాశాన్ని నిరోధిస్తే దాని ప్రభావం తీవ్రంగా వుంటుందని, అలనాటి నీలం సంజీవ రెడ్డి వలె రాజకీయ ప్రవాసంలోకి వెళ్లి పోవలసిన పరిస్థితి ఏర్పడుతుందని హెచ్చరించారట. దానితో రాజశేఖర రెడ్డి తన దూకుడు తగ్గించు కున్నాడని చెప్తారు. ఈ పరిణామాలన్నీ పివికి తెలుసు. కోట్ల కూడా రాయలసీమలో తనకు సమాంతరంగా మరొక నాయకుడు ఎరగడం సహించలేక అప్పట్లో రాజశేఖర రెడ్డికి కేంద్రంలో మంత్రిత్వం రాకుండా అడ్డు పడ్డారని వినికిడి. నెపం కోట్ల పై నెట్టి పివి తప్పించు కున్నారు.

ముఖ్యమంత్రి గనుక తన వర్గీయులను మంత్రి వర్గంలో తీసుకుంటే రాష్ట్రంలో అసమ్మతిని వదులు కుంటానని రాజశేఖర రెడ్డి చెబుతున్నారు. పనిలోపనిగా రాష్ట్ర ప్రభుత్వ పని తీరు గురించి రాజశేఖర రెడ్డి విమర్శలు గుప్పించటంతో పాటు దుర్భిక్ష ప్రాంతాల పట్ల రాష్ట్ర ప్రభుత్వం ఉదాసీనంగా వ్యవహరిస్తోందని, కరువు సహాయక చర్యలు చేపట్టకుండా రాష్ట్ర ప్రభుత్వం నిద్రపోతున్నదని ఆరోపించారు. దీనితో కోట్ల వారి కోటలో చలనం కలిగింది. ప్రధానికి వ్యతిరేకంగా వై.ఎస్. చేస్తున్న ప్రకటనలకు ఏ మాత్రం స్పందించని ముఖ్యమంత్రి, రాష్ట్ర ప్రభుత్వం పై విమర్శలకు మాత్రం హడలెత్తి పోయారు. రాజకీయంగా వై.ఎస్. సహాయం తనకు భవిష్యత్తులో అవసరం కాబట్టి వై.ఎస్.ను దువ్వి మంచి చేసుకోవాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారట.

అనుకున్నదే తడవుగా ఆయన రాష్ట్ర ప్రభుత్వ ముఖ్యకార్యదర్శి జయభారత్ రెడ్డిని వై.ఎస్. దగ్గరకు పంపారు. కడప జిల్లాకు చెందిన జయభారత్ రెడ్డి మొదటి నుంచి వై.ఎస్.కు సన్నిహితుడు కావడం ఇక్కడ గమనార్హం. ముఖ్యమంత్రి ఆదేశం మేరకు జయభారత్ రెడ్డి ఆదివారం నాడు వై.ఎస్.ను కలుసుకొని, కరువు పనుల వివరాలు తెలపటంతో పాటు రాజీకి తగిన వాతావరణం కల్పించినట్లు తెలుస్తోంది. ఒకే గూటి పక్షుల్లా కేంద్రంలో పి.వి.కి వ్యతిరేకంగా వ్యవహరించడంతో పాటు రాష్ట్రంలో కలిసి మెలిసి వ్యవహరిం చేందుకు వీలుగా వై.ఎస్. వర్గీయులకు త్వరలో జరుగనున్న మంత్రి వర్గ విస్తరణలో స్థానం కల్పిస్తారు.

ఇలా వుండగా కేంద్రంలో పి.వి. గారి ఆలోచనలు కూడా ఇదే మాదిరిగా వున్నట్లు వినికిడి. సొంత రాష్ట్రం నుంచే ముసలం ప్రారంభం కావడం పట్ల పి.వి. పరేషాన్‌లో పడిపోయారట. ఆంధ్ర ప్రదేశ్ నుంచి

కొరవ 8 పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,